

# మేము కాంగ్రెస్‌లో ఎందుకు చేరలేదు?

్యలయం, బెజవాడ

పా వ లా

# మేము కాంగ్రెసులో
# ఎందుకు చేరలేదు?



కర్తలు:
ఉప్పల లక్ష్మణరావు
మెల్లీ స్లోలింగ్రర్



ప్రజాశక్తి కార్యాలయం,
మొగల్‌రాజపురం — బెజవాడ.

# ర చ యి త లు

## ఉ ప్ప ల ల క్ష్మ ణ రా వు

1898 బరంపురంలో వీరి జననం, కలకత్తా (బి. ఎస్. సి.) ఎడింబరో (ఎం. ఏ;) టూబింగెను జర్మనీ (డి. ఎస్. సి.) యూనివర్సిటీ లలో విద్యాభ్యాసం. స్విట్జర్లెండులో శ్రీమతి సోలింగరుగారితో కలిసి 1924 లో అచ్చటి కార్మికోద్యమంలో పాల్గొన్నారు. స్వదేశానికి వచ్చిన తరువాత 1926—27 లో రైల్వే సమ్మెలోనూ, కార్మికోద్యమములోనూ, శ్రీ వి. వి. గిరిగారి ఆంతరంగిక కార్యదర్శిగా పనిచేశారు. తరువాత రెండుసంవత్సరములు సుప్రసిద్ధ వృక్షశాస్త్రవేత్తయగు సర్. జె. సి. బోసు గారివద్ద శిక్షణ పొందారు. 1929—30 లో కాకినాడ కాలేజీ, అలీఘరు ముసలిమ్ యూనివర్సిటీలలో అధ్యాపకులుగా ఉన్నారు. సత్యాగ్రహోద్యమ మందు శిక్షణపొంది' శ్రీమతి సోలింగరుగారితో కలిసి ఖాదీ ప్రచారమును ఖాదీ పరిశోధనలు చేసేరు. 1934 లో విశాఖపట్నమందున్న ఆంధ్ర యింజ నీరింగు సంస్థయందు చేరారు. 1937లో వ్యవహారరీత్యా జర్మనీవెళ్ళారు. ఆ సందర్భమునవే మాస్కో పందర్శించారు. 1939 నుంచి ఆంధ్ర సిమెంటు కంపెనీ మేనేజరుగా బెజవాడలో నివాసము.

II

## మెల్లీ సోలింగరు

ఈమె 1898 వ సంవత్సరం జ్యూరిచ్ (స్విట్జర్లాండు)లో జననం. వైద్య కళాశాలలో ప్రవేశించి చదువు పూర్తిచేయకముందే తండ్రిగారి రసాయినిక, పట్టు వ్యాపారమందు ప్రవేశించిరి. 1928 వరకు అందులో పనిజేసి వ్యవహారరీత్యా యూరపు, ఇంగ్లాండులలో పర్యటనజేసి 1929లో ఇండియాకు వచ్చింది. సత్యాగ్రహోద్యమం ప్రారంభంలో సబర్మతీ ఆశ్రమం వెళ్ళి అచ్చట ఖాదీ పరిశ్రమలో తర్ఫీదుపొంది 1935 వరకు ఆంధ్రరాష్ట్రం అంతటా ఖాదీ ప్రచారము చేసిరి. కలకత్తాలో శ్రీ సతీష్‌దాసు గుప్తగారి "ఖాదీప్రతిష్టాను" లో కొంతకాలము నివసించి, ఖాదీపరిశోధన సాగించుచు అచ్చట హరిజన ఆస్పత్రిలో పనిచేసిరి. డాక్టరు ఉప్పల లక్ష్మణరావుగారితో కలిసి ఆంధ్రలో పొందూరు సన్ననూలుపై పరిశోధనలు చేసి "భారతి" "మోడరన్ రివ్యూ" పత్రికలలో కొన్ని వ్యాసాలు ప్రకటించారు. 1937 లో స్వదేశమునకు వెళ్ళి జర్మనీ, ఇటలీలలో పర్యటన చేసి అప్పుడే రష్యాకూడ సందర్శించారు. చిరకాల మిత్రులగు లక్ష్మణ రావుగారిని మాస్కోలోనే వివాహమాడిరి, 1938 లో ఇండియాకు వచ్చి బెజవాడలో నివాసమేర్పరచు కొన్నారు. 1940 వ్యక్తి సత్యాగ్రహములో రెండుసార్లు (ఏడు నెలలపాటు) జైలుశిక్ష ననుభవించారు. 1942 ఆగస్టు తరవాత గాంధీజీ జన్మదినోత్సవం జరిపినందుకు వీరికి రెండున్నర సంవత్సరాలు శిక్ష వేయబడెను. కాని సంవత్సరం నాలుగునెలలు శిక్ష ననుభవించిన తరువాత బేషరతుగా విడుదల చేయబడిరి.

—సంపాదకుడు

# మనవి

ఈ లేఖలు మేము ఆత్మీయులకు వ్రాసుకొన్నవి. వ్రాసేటపుడు ప్రకటించాలనే ఆశయంలేదు. 25 యేండ్లుగా కాంగ్రెసు అభిమానులంగా వుంటున్న మా కుటుంబంలో ఒండొరుల అభిప్రాయాలను తెలుసుకోడానికి యీ జాబులు వ్రాయబడ్డాయి.

నేడు యిలాంటి అభిప్రాయభేదాలు, సంఘర్షణలు అనేక దేశభక్త కుటుంబాలలో జరుగుతుండవచ్చు. ఏమంటే నేడు భారత రాజకీయ వాతావరణంలో తీవ్రమైన తుపాను వీస్తూంది. కాంగ్రెసువంటి ప్రధాన రాజకీయసంస్థ నాయకులే విచ్ఛిన్న కారక ప్రయత్నాలు చేస్తున్నారు. దేశభక్తి తమ ఒక్కరి ముల్లె అంటూ దేశభక్తులలో, స్వాతంత్ర్యోద్యమంలో చీలికలు తెస్తున్నారు. ప్రజలందరూ ఏకమయి బ్రిటిషు సామ్రాజ్యవాదులను బయటికినెట్టవలసిన యీ సమయంలో, కాంగ్రెసు నాయకులు యిలా చేయడం దేశానికి ఎంతో అరిష్టం.

ఈ విధానంవల్లనే అనేక దేశభక్త కుటుంబాలలో ఇలాంటిఘర్షణలు వస్తున్నాయి, మేము భరతుడికి వ్రాసిన జాబులో కాంగ్రెసు భక్తివున్న వారికి కమ్యూనిస్టుల పాలసీ యెడలవున్న సందేహాలను తీర్చడానికి ప్రయత్నించాం.

ఈ జాబులను ప్రకటించడంవల్ల ఇలాంటి సన్నివేశాలలో, ఇలాంటి సందేహాలతోనే బాధపడుతున్నవారికి ఉపయోగపడతాయనీ, తాము ప్రకటనకు పూనుకుంటామనీ ప్రజా ప్రచురణాలయంవారుకోరారు. దేశభక్తులలో సామరస్యం కలిగించడానికి ఏమాత్రం యివి ఉపకరించినా మేముధన్యులమయ్యామని భావించుతాము. ఆ ఆశయంతోనే మేము వీటిని ప్రచురణకు యిస్తున్నాము.

ఉప్పల లక్ష్మణరావు
మెల్లీ షోలింగర్

# ఇందులో

**లక్ష్మణరావుగారికి జాబులు :**

1 భరత

11 చిం. బాబు

ప్రశ్నలకు లక్ష్మణరావుగారి జవాబులు

కాంగ్రెసుమీద అంత ఈ మధ్యనే తొలగింది. తరవాత మీదృక్పథం మారినదా ?

సిమ్లా సమావేశంలో కాంగ్రెస్ అనుసరించిన పాలసీవల్ల మీపై ఖరి మారిందా ?

'కాంగ్రెస్ ఎన్నికలలో పాల్గొనాలని' నిశ్చయించడం మీ వైఖరిని మార్చిందా ?

కాంగ్రెస్ కార్యవర్గాలలో కమ్యూనిస్టులుండరాదని కాంగ్రెస్ అనడం వల్లనా ?

పాకిస్తాన్‌కు వ్యతిరేకంగా కాంగ్రెస్ అవలంబించిన వైఖరిని మీరు బలపరుస్తారా ?

కాంగ్రెస్ తీర్మానాలలో దేశక్షేమానికి భంగం కలిగించేవి ఏవేవి ?

కాంగ్రెస్‌కి మద్దతువిచ్చినట్టయితే పెట్టుబడిదారులపక్షం అవుతుందనీ కార్మిక, కర్షకులకు అన్యాయం చేస్తుందనీ సామ్యవాద లక్ష్యాల అమలు జరపదనీ మీకు నమ్మకమా ?

కాంగ్రెసు ఎన్నికలకు నిలబెట్టిన అభ్యర్థుల నియామకాలు ఏమీ బాగా లేవనా ? లేక కాంగ్రెసు పార్లమెంటరీబోర్డు పెద్దలలో ఏమీ నమ్మకం లేకపోవడాన్నా ?

1940 - 44 నాటి కాంగ్రెస్ కమిటీలలో మీకు విశ్వాసం ఎందుకు సడలిపోయింది ?

కాంగ్రెసు ఎన్నికల, ఆర్థిక ప్రణాళికలు బాగులేవనా ?

క్విట్ ఇండియా నినాదానికి మీరెందుకు అభ్యంతర పెడతారు ?

బరంపురం
18-11-45

ప్రియమైన లక్ష్మణకి—

చాల రోజులనించి నీ పేర ఉత్తరం రాద్దామనుకుంటున్నాను, రోజులనుంచికాదు, నెలలనించికూడా. కాని ఉత్తరాలురాయడం బొత్తిగా అలవాటు లేకపోవడంవల్ల తరువాతరాద్దాం, తరువాతరాద్దాం అని గడువు పెట్టేస్తూవచ్చాను. ముఖ్యంగా మీరు సోవియటుదేశం గురించిరాసిన పుస్తకం మాకు పంపించి దానిని గురించి మాఅందరి అభిప్రాయాలు వినాలని ఉందని వ్రాసినా ఆ పుస్తకం గురించి అభిప్రాయంకూడా ఇన్నాళ్ళకు రాయవందుకు కూడ సిగ్గుగానే ఉంది.

నాకు తెలుగులోకానీ. ఇంగ్లీషులోకాని పుస్తకాలు చదవడం అట్టే అలవాటులేదు. కాని నువ్వుపంపిన పుస్తకం మాకు అందినరోజునే చదివేశాను. పుస్తకం చదవడానికి చాలబాగుంది. నేను రష్యాను గురించి ఏపుస్తకాలూ చదవలేదు. అంచేత పుస్తకం విమర్శించడానికి తగిన తాహతు లేదనుకుంటా. ఇదొక కారణం నేను అంతగా మీపుస్తకం గురించి వ్రాయక పోవడానికి. విమర్శించ తగ్గ విషయాలు కొన్ని కనపడ్డప్పటికీ ఇప్పుడవి జ్ఞాపకంలేవు.

ఈవాళ వచ్చిన ఉత్తరంలో మీరిద్దరు కాంగ్రెసుతో నాలుగణాల సంబంధంగూడ వదులుకోవాలని అనుకుంటున్నారని వ్రాశావు. ఇది నాకు చాలకొత్తగా అనిపిస్తున్నది. కాంగ్రెసు ఎడల ఇంతవిరోధభావం. విముఖత ఎప్పటినుంచి కలిగిందో తెలియటంలేదు. 1942-44 వరకు కాంగ్రెసు విధానంలోనీకు, ముఖ్యంగా మెల్లీ (షోలింగరు)కి నమ్మకం ఉన్నట్లే అర్థం అవుతుంది. దాని తర్వాత కాంగ్రెసుపైని అంశతొలగి కొన్ని నెలలే అయినది కదా? కమక ఈ కొద్ది నెలలలోనే మీలో మార్పుకలిగిందా? లేక సిమ్లాలో కాంగ్రెసు వైఖరి మీలోమార్పు తెచ్చిందా? లేక కాంగ్రెసు ఎన్నికలలో నిలవాలని నిశ్చయించడమా? లేక కాంగ్రెసు అధి

కారపదవులలో. ఇండియా కమ్యూనిస్టుపార్టీవారు ఉండరాదని అనడమా ? లేక కాంగ్రెస్ పాకిస్తాన్, స్వయం నిర్ణయ సూత్రం గురించి చేసిన తీర్మానమా ? కాంగ్రెసుకి మద్దతు ఇచ్చినట్లయితే పెట్టుబడిదారుల పక్షం అవుతుందని కార్మిక కర్షకులకు అన్యాయం చేస్తుందని. సామ్యవాద లక్ష్యాలు అమలు జరపదని మీకు నమ్మకమా ? కాంగ్రెసు చేసిన తీర్మానాలలో ఏవి అనర్థకంగా ఉన్నాయని మీరనుకుంటున్నారు. లేక కాంగ్రెసు ఈ ఎన్నికలకి నిలబెట్టిన అభ్యర్థి నియామకాలు ఏమీ బాగులేవనా ? లేక కాంగ్రెసు కమిటీలలో ఏమీ నమ్మకంలేకపోవడాన్నా ? కాంగ్రెసు మీద ఆంక్షతొలగిం తర్వాత రాష్ట్ర కమిటీలకు వేటికిగాని ఎన్నికలు జరుపలేదు కదా ? కాంగ్రెసువారి ఎన్నికల ప్రణాళిక ఏమీ బాగులేదనా ? కాంగ్రెసు వారు ఆర్థిక ప్రణాళిక తయారు చేయలేదనా ? కాంగ్రెసు క్విటిండియా నినాదం బాగు లేదనా ? కాంగ్రెసు పెద్దలు నెహ్రూ పట్టాభిగార్ల ఉపన్యాసాలలో దుడ్డు కర్రవాదం ఉపయోగిస్తున్నారనా ? ఇంతమాత్రంచేత అసలు కాంగ్రెసుమీద విముఖత ఏర్పడుతుందా ? ఎలెక్షనులలో ఉపన్యాసకుడికి వినడానికివచ్చే ప్రజాసమూహాలకి పరస్పరవిశ్వాసం, ఉత్సాహం ఎక్కువగా ఉన్నప్పుడు ఇచ్చే ఉపన్యాసధోరణిలోగల అతిశయోక్తులకి బెదరింపులకి, తమాషాలకి ఆమాత్రం మినహాయింపు ఇవ్వవద్దా ? నెహ్రూవ్రాతల లోనూ, ఇస్తూ ఉన్న అనేక ఉపన్యాసాలలోనూ ప్రకటనలలోనూ ఎన్నికలకి అట్టే ప్రాముఖ్యత ఇవ్వడంలేదు కదా ? అలాంటప్పుడు నెహ్రూ ఉపన్యాసాలలో దుడ్డుకర్రవాదమే కనపడుతున్నదని ఎత్తి పొడవడంలో న్యాయం కనపట్టంలేదు. బ్రిటిషు గవర్నమెంటువారు కాంగ్రెసును విచ్ఛిన్నం చేసే ప్రయత్నాలకి, మనదేశంలో కాంగ్రెసుకాక అనేక బలీయమైన పార్టీలున్నాయని, అందుచేత ఈభేదాభిప్రాయాలవల్ల బ్రిటిషువారు అధికారం వదులుకోలేకుండా ప్రతిబంధకం ఏర్పడుతున్నదన్న వాదానికి మీరుకాంగ్రెసేతర పక్షాలతో కలసి కాంగ్రెసును నీరసపరచే ప్రయత్నాలు తోడ్పడవా ? ఇటువంటి సమయాలలో ఇన్నాళ్ళనుంచి ప్రజాశయాలకి చిహ్నంగా ఉన్న కాంగ్రెసును విచ్ఛిన్నపరచే ప్రయత్నాలకు మీరు తోడ్పడడము దేశక్షేమ

మేనా? ఈ కళా వెంకట్రావు. కాశేశ్వర్రావు మొదలైన ప్రస్తుత రాష్ట్ర కమిటీ నాయకులలో ఉండే లోటు పాట్లను దృష్టిలో ఉంచుకొని కాంగ్రెసుమీద తిరుగుబాటు చేయడం మంచిదా? మీరీ విషయాలన్నీ ఆలోచించడం లేదని నేను వ్రాయడంలేదు. మీరు రాజకీయ, చారిత్రిక పరిజ్ఞానం విశేషంగా ఉన్నవాళ్ళు కనుక అనేక పత్రికలు జాగ్రత్తగా చదివేవారు కనుక మాలాంటి వారికి మీ అనుభవ పరిజ్ఞాన లాభంకలుగ జేయాలని నాకోరిక. కనుకనే మీరు కాంగ్రెసును వదలి వేసేముందు మీఅభిప్రాయా ప్రచారంముందు మాదగ్గరినే ప్రారంభించి మమ్మల్నికూడా మీవేపుమార్చుకోవడానికి ఈవూరు తప్పక రావాలి. ఇప్పటికీ ఉత్తరం పెద్దదవడంవల్ల చీకాకు కలిగిస్తుందని ఆపుచేస్తున్నాను.

ప్రేమతో భవదీయుడు

భ ర త

# II

ప్రియమైన లక్ష్మణ మామయ్యకి—

నీవు వ్రాసిన వుత్తరం అందినది. అందులో విపులంగా వ్రాసిన అన్ని సంగతులు అవగాహన చేసికొన్నాను. చాలమట్టుకు నీతో నాకు ఏకాభిప్రాయమే! అయితే ఒక్క విషయం. ఎన్నికలలో కాంగ్రెసుతో పోటీచేయడానికి నాకు అంత ఆధారం కనిపించడం లేదు. ఈ విషయం గురించి భరతమామయ్య వ్రాసిన సంగతులు చదివాను. కొంతవరకు అవన్నీ సమంజసంగానే ఉన్నట్లు తోస్తున్నాయి. మరియు రాజ్యాంగ ప్రతిష్టంభన భగ్నం చేయడం నిమిత్తమే కాంగ్రెసు యీ ఎన్నికలలో పాల్గొంటున్నది. అలాంటప్పుడు ఎన్నికల ప్రణాళికకి ఆర్థిక సూత్రాలకి అంత ప్రాముఖ్యత ఉండదేమో! అయినా కమ్యూనిస్టుల వైఖరి కాంగ్రెసులోని లోపాలను ప్రపంచానికి చాటడము మంచిదే. అయితే దేశవిరోధులైన మిగతావారితో కలిసిపోవడం శోచనీయం. ఉదాహరణగా అంబేద్కరు పార్టీతో రాజీ. కాంగ్రెసు కమ్యూనిస్టుల మధ్య ఓట్లు భాగింపబడి స్వార్థపరులకీ, ఇంకా ఎందుకీ పనికిరాని వారికీ ఓటు ఇవ్వడం అవుతుందేమో! ఇదే విషయం మీద ఇంకా విపులంగా రేపు వ్రాస్తాను. మెల్లీని, స్వామినాధన్‌ను అడిగినానని చెప్పు.

ప్రేమతో

చిం. బా బు.

# లక్ష్మణరావుగారి జవాబు

భరతా : నీ వుత్తరానికి అనేక వందనాలు, నీ ప్రశ్నలు మే మిద్దరం జాగ్రత్తగా ఆలోచించి ఈ క్రింది సమాధానాలిస్తున్నాం, ఇందులో సింహం వేసిన రెండు ప్రశ్నలకూ (పాకిస్థానం—అంబేద్కరు) కూడా జవాబుఉంది,

ప్రశ్న 1, కాంగ్రెసుమీద అంత ఈ మధ్యనే తొలగింది, తరవాత మీ దృక్పథం మారినదా ?

జవాబు ; గాంధీజీ తనకున్నూ వైస్రాయికిన్నీ ఉత్తరాల్లో ఆగస్టు సంఘటనలు తనచేతగానీ, కాంగ్రెసు చేతగానీ నడపబడిన ఉద్యమం కాదని వ్రాశాడు. ఆ వుత్తరం చదవకముందు ఆగస్టు ఉద్యమం, ఆగస్టు పోరాటం గాంధీజీయే నడిపించాడని అనుకున్నాం. కాని గాంధీజీ లేఖలతో అది పొరపాటు అని తెలిసింది. అబ్దుల్ కలాం అజాద్ లేఖలో కూడ కాంగ్రెసు ఉద్యమం కాదని తెలిపేడు. అయినా ఒకవైపు ఇది కాంగ్రెసు ఉద్యమం కాదంటూ, రెండోవైపు ఇది కాంగ్రెసుయొక్క పోరాటమే నంటూ, కాంగ్రెసు నాయకులు ఉద్యమంలో పాల్గొనని వాళ్ళను ద్రోహులని దూషించడం మొదలుపెట్టేరు. దీనివల్ల కాంగ్రెసు నాయకులకు తమ వైఖరి ఎలా వుండాలో, నిశ్చయించుకోలేకుండా ఉన్నారనిన్నీ గాంధీజీ యొక్క అభిప్రాయంతో సంపూర్ణంగా ఏకీభవించ లేకండా ఉన్నప్పటికీ ఆ మాట బయలు పెట్టడానికి ధైర్యసాహసాలు లేవనిన్నీ, ఏదో ఒక సాకు తీసికొని కాంగ్రెసులోనే అధికారం చెలాయిస్తున్నవారికి వ్యతిరేకంగా ఉన్న వారిని అణచి పెట్టేయడానికి మార్గం వెతికేరని మాకు తోచింది. గాంధీ యొక్క సూత్రాలుకాని, అధికారయుతంగా కాంగ్రెసు చేసిన నిశ్చితాభిప్రాయాల యడల కాని, కాంగ్రెసు నాయకులకీసంకుచిత భావం ఏర్పడిందనిన్నీ తేలింది. ఆరోజునుంచి ఈ రోజువరకూ అలాగే ఉంది. గాంధీజీ మొన్న గోపాలస్వామికి వ్రాసిన ఉత్తరం చూడు. రెండోవైపు అవకతవక భాష్యాలు చూడు : కాంగ్రెసు తన మనసు తానే తెలుసుకోలేకుండాఉంది,

ఇది కాంగ్రెసు ఉద్యమేనని ఘంటాపథంగా చేస్తే-గాంధీ తత్వము మీద పూర్తి అపనమ్మకం, గాంధీజీనే అబద్ధీకుణ్ణిగా చేయడం, గాంధీ నాయకత్వానికే స్వస్తి చెప్పడం అవుతుంది. ఇది కాంగ్రెసుది కాదు అనంటే తమ అనుచరులతో ఇన్నాళ్ళూ చెప్పిన మాటలను తామే వెనక్కి తీసుకోవలసి వస్తుంది. అగస్టు వ్యతిరేకులదే పైచెయ్యి అవుతుంది. బ్రిటిష్‌వారితో ఒక మాట-ప్రజలతో మరొకమాట. ముందుకు గొయ్యి. వెనుకకు నుయ్యి. ఈవిధంగా ఒకమాట మీదగాని, ఒక నిశ్చితాభిప్రాయం మీదకాని, ఒక నాయకత్వంమీద కాని నిలబడలేని సంస్థ అయింది కాంగ్రెసు. అలాంటి నాయకులు పాలించే సంస్థమీద విశ్వాసం ఎలా ఉంటుంది.

ప్రశ్న 2. లేకుంటే, సిమ్లా సమావేశంలో కాంగ్రెసు అనుసరించిన పాలసీవల్ల మీ వైఖరిమారిందా ?

జవాబు: కాంగ్రెసులో ఇలా సంకుచితభావం ఉండబట్టే, సిమ్లాలో కాంగ్రెసుకు పూర్తి అపజయం వచ్చింది. గాంధీజీ జిన్నాతో సంప్రదించడమే అసలు కాంగ్రెసుకు ఇష్టంలేదు, అంచేత గాంధీజీని తోసిరాజన్నారు. లియాఖత్ అలీఖాన్‌తో మాట్లాడడానికి ఇతడెవరు ? అని భూలాభాయిని యీడ్చిపారేశారు? కాంగ్రెసు-లీగు సమానత్వం అన్న గాంధీసూత్రాన్నే నిరాకరించి వేవెలు మీదనే పూర్తి నమ్మకం పెట్టుకొని లీగును అణచివేద్దాం అని పట్టుబట్టి జాతీయ మహమ్మదీయులను, 'సైంధవ లడ్డుల' ని మధ్యపెట్టి హిందూ మహమ్మదీయ సమానత్వం అంటూ వేవెలుకు తాళంవేసి రణభేరీలు, జయభేరీలు కొడుతూ, మానాభిమానాలూ, సిగ్గు లజ్జలూ, పరువు మర్యాదలూ వొదిలిపెట్టి-పదవులకోసం విర్మొగమాటంగా పాకులాడేరు. పరనింద, ఆత్మస్తుతి, శత్రుశరణ-బ్రిటిషువాళ్ళు మహామంచివాళ్ళు - జిన్నా. కమ్యూనిస్టులు దొంగలు-వేవెల్‌కు జై-జై-గాంధి-దేశాయి హై-హై-ఇలా జరిగి చివరకి కాంగ్రెసు లీగు ఐక్యత అసలే అక్కర్లేదంటూ, బ్రిటిష్‌వాడే మన నెత్తిమీద కిరీటం పెడతాడంటూ - వాడిమంచిఉంటే హిందూ మహమ్మదీయ సంఘటన లేకపోయినా, స్వరాజ్యం వాళ్లు ప్రసాదిస్తారని, వెర్రిఆశలు పడడం చివ

రకి వేవెలు కుట్రలోపడి మతాబా కాల్చడం అయింది, సిమ్లా రోజుల్లో కమ్యూనిస్టులు ఏమన్నారో జ్ఞాపకం చేసుకో: "కాంగ్రెస్ లీగు ఒడం బడిక లేకుండా సిమ్లాకి వెళ్ళకండి: లీగును తోసిరాజంటే మీరు అసలు శత్రువును ఓడించలేరు. బ్రిటిషువాళ్ళ తత్వాన్ని నమ్మకండి - ఇది ఎన్ని కల కుతంత్రం - వారు కాంగ్రెసువారితో ఒకనాలుకతో మాట్లాడుతారు. లీగువారితో మరొకనాలుకతో మాట్లాడుతారు. చివరకు మీకు మొండిచెయ్యి చూపిస్తారు సుమండీ: అని ఇంతగా చెప్పినా వినలేదు అప్పట్లో. చూడు మొన్న చెన్నపట్నంలో ఉపన్యాసంఇస్తూ పట్టాభి ఏమన్నాడో "ఇది ఎలక్షన్ కుతంత్రంఅని తెలుసుకోలేకపోయినాం. వేవెలు మంచివాడను కున్నాం. అంచేతనే సిమ్లాలో ఫలితం పొందలేకపోయినాం." అని ఒప్పుకోక తప్పిందికాదు. కాంగ్రెస్ తొక్కుతున్నది తప్పుదారి అని చెప్పడానికి ఇంకా వేరే నిదర్శనం ఎందుకు? అయినా కాంగ్రెస్ తనబుద్ధి మార్చుకోకుండానే వ్యవహరిస్తున్నది.

ప్రశ్న 3. 'కాంగ్రెస్ ఎన్నికలలో పాల్గొనాలని నిశ్చయించడం' మీ వైఖరిని మార్చిందా?

ప్రశ్న 4. కాంగ్రెసు కార్యవర్గాలలో కమ్యూనిస్టు లుండరాదని కాంగ్రెస్ అనడంవల్లనా?

జవాబు: ఎన్నికలు అవసరం - అందులో కాంగ్రెసు పాల్గొంటుంది. అనడం సరియైనదే: అయితే ఏమిలాభం? వయోజనఓటింగు హక్కు సాధించకుండా, జాతీయప్రభుత్వం యాజమాన్యంక్రింద నడప బడని ఎన్నికలు దేన్నీ సాధించలేవు. చివరికి ప్రతిష్టంభనే ఏర్పడు తుంది. మనలో అంతఃకలహాలు మరింత విషమించడం, పరాయివాడు మనఇంట్లో శాశ్వతంగా తిష్టవేసుకు కూర్చోవడం - ఈ ఎన్నికలు మనకి స్వరాజ్యం తీసుకురావు. ప్రజా పరిషత్తునీ, తాత్కాలిక రాష్ట్రీయ ప్రభు త్వాలనీ ఏర్పరచడానికే రాజ్యాంగ ప్రణాళిక నిర్ణయించగలిగే రాజకీయ యంత్రాన్ని సృష్టించడానికేతప్ప, స్వరాజ్యం, స్వాతంత్ర్యం తీసుకురావు. అది ఇంకా ముందుకువుంది. ఎంతో ముందుకువుంది. "తొందరపడకే

సుందరదేవీ - ముందుకుంది ముసళ్ళపండుగ-" అలాగా ఐక్యత ఏర్పడక పోతే ఎన్నికలవల్ల తేలేది ప్రతిష్టంభనే. పట్టాభి భాష్యం ప్రకారం కాంగ్రెసుఆశయం అంతేకదా? QED Reductio Ad absurdom

ప్రశ్న 5. పాకిస్థాన్‌కు వ్యతిరేకంగా కాంగ్రెసు అవలంబించిన వైఖరిని మీరు బలపరుస్తారా? (ఏ. ఐ. సి. సి. నిర్ణయం - స్వయం నిర్ణయసూత్రం మొదలగునవి.)

ప్రశ్న 7. కాంగ్రెసు తీర్మానాలలో దేశక్షేమానికి భంగం కలిగించేవి ఏవేవి?

జవాబు: సిమ్లా సమావేశంలో కాంగ్రెసు వైఖరిచూడు, ముస్లింలీగు మీద కసి, ఉక్రోషం, కాంగ్రెసు నెంతవరకు తీసుకు పోతూందో! దుర హంకారం క్రోధం-మదం, మాత్సర్యం, అరిషడ్వర్గాలన్నీ కాంగ్రెసును గుడ్డిగా చేస్తున్నాయి.

బ్రిటిషు వారు హిందూదేశానికి స్వరాజ్యం నిరాకరించడానికి ఎన్ని కొంటి సాకులు చెబుతున్నారో చూడండి :- "హైందవులందరూ ఏకైక జాతివారు కాదు - జాతి మత భాషాభేదా లనేకం ఉన్నాయి. స్వరాజ్యా కాంక్ష కొద్ది మందికే ఉంది - బహుళ సంఖ్యాకులు బ్రిటిషు సామ్రాజ్యం లోనే చిరస్థాయిగా ఉంటాముగాని మాకు స్వాతంత్ర్యం అక్కర్లేదంటు న్నారు. మేం వెళ్ళిపోతే మిమల్ని మీరు రక్షించుకోలేరు. పరరాజ్యాల వారు మీ మీద దండెత్తివస్తారు. లేదా మీలో మీరే కొట్టుకుని చస్తారు. మీకుతగిన సాంకేతిక విద్యలేదు - మీరు అన్నివిధాలా వెనుకబడి ఉన్నారు. మీ ఆర్థిక జీవనం నశిస్తుంది మేం లేకపోతే - అంచేత మేం ఉండడం మీకేమంచిది. - పోనీ అధినివేశ ప్రవత్తితో తృప్తి పడండి - సంపూర్ణ స్వాతంత్ర్యం తీసుకోండి - అంతేగాని బ్రిటిషు సామ్రాజ్యంలోనుంచి వెళ్ళి పోకండి." అని అంటే మనం ఏమంటున్నాం? మా యిష్టం, మేంచస్తే చస్తాం. స్వరాజ్యం మా జన్మహక్కు, అంచేత మా కదికావాలి! భారతీ యులందరం ఒక జాతివారం అని మీకు నిరూపించడం మాకేం అవుస రంలేదు. మా హృదయకోశాలో మేం ఒక జాతివారమని అనుకుంటు

న్నాం, మా అంతరాత్మ మాకు చెబుతూంది. మా అంతరాత్మల్లోనుంచి మాకా ఆకాంక్షపొంగి వస్తూంటే అడగడానికి మీరెవరు? అని అంటు న్నామా. లేదా?

అలాగే "మేం ఒక జాతివారం. మాకు మీతో ఉండడం ఇష్టం లేదు. మేం వేరేస్వరాజ్యం స్థాపించుకుంటాం." అని ముస్లిములుఅంటే "వీల్లేదు - మీరు మాతో కట్టుకుండాలి-" స్వరాజ్యం ఇవ్వంకాని - రాష్ట్ర స్వాతంత్ర్యం ఇస్తామనడం ఏం ధర్మం? అది అలా ఉండగా; ఒక నోటితో జగత్ నారాయణలాల్ తీర్మానమే ఖాయం అనడం, ఆ నోటి తోనే వెనుకటి ఢిల్లీవర్కింగ్ కమిటీ స్వయం నిర్ణయ తీర్మానం - ఇది ఇలా ఉండగా - గాంధీ-జిన్నా సంప్రతింపులు - భూలాభాయి - లియాఖతు ఒడంబడిక, వర్కింగ్‌కమిటీవారు గాంధీజీ దేశాయీలమీద రౌద్రం అయి పోవడం - పోనీ ఏదో స్వల్పంగానైనా జిన్నాతో మంచిగామాటాడుదాం అని అజాద్ శ్రీనగరంలో మెత్తగా మాట్లాడుతూంటే అతన్ని మర్నాడే ఎత్తిపొడవడం - అందునా ఇందునా పొందకుండా - సుస్పష్టం చేద్దాం - అంటూమరింత గంద్రగోళంకి కారణంగా - పూనాలో "సమన్వయం" (1) చేస్తూ వర్కింగ్ కమిటీవారి తీర్మానం - ఆ తీర్మానం ఏ. ఐ. సి. సి. ఎదుట పెట్టడం అనవసరం అనడం - ఇదంతా చూస్తూ పాకిస్థాన్ ఎడల కాంగ్రెసువైఖరి ఎట్లా బాగుందనడం? "పాకిస్థాన్ నైజాంతా" అన్నారు సరే. అథవా గాంధీ రాజాజీ సూత్రాన్నైనా కాంగ్రెసు అధికార యుతంగా ఒప్పుకోలేదు సరేకదా, మళ్ళీ జగత్ నారాయణలాల్ తీర్మానం అంటూ "పాడిందే పాడరా పాచిపండ్లదాసరీ" అంటూంటే దూరదృష్టి, రాజకీయ ధర్మం ఏమైనా ఉందా? అన్ని విధాల హిందువులకంటే ఆర్థికంగానూ, రాజకీయంగానూ, తక్కువస్థితిలో ఉన్నప్పుడు, వాళ్ళను అన్నివిధాల తృప్తి పరచడం మనవిధాయకం.

ప్రశ్న 6. కాంగ్రెసుకి మద్దతు విచ్చినట్లయితే పెట్టుబడిదారులపక్షం అవుతుందని, కార్మిక కర్షకులకు అన్యాయం చేస్తుందని, సామ్య వాద లక్ష్యాల అమలుజరపదనీ మీకు అపనమ్మకమా?

జవాబు; అంతమాట అనడానికి మేం ఇద్దరం భయపడతాం. కాని ఎంతో త్యాగఫలితంగానూ, ఎన్నోసంవత్సరాలనుంచి నిరాఘాటంగా, జయప్రదంగా పనిచేస్తున్న కిసానుసభ. ట్రేడ్‌యూనియన్‌లకు ఈ వాడు పోటీ సంస్థలను ప్రోత్సహించడం ఈ విచ్ఛిన్న ప్రయత్నాలు ఒకమూల- మరొకమూలరేవు కాంగ్రెసుఅధికారంలోకి తప్పకుండావస్తూంది; అంచేత మనం ఏలాగో ఒకలాగ అందులో దూరాలని వస్తున్న దొంగవ్యాపారులు, తిండిదొంగలూ, కార్మికోద్యమాన్ని విచ్ఛిన్నం చేస్తూ పేరుబడ్డ పెట్టుబడి దార్లు, రైతులను పీడించుకుతింటూ జమిందారీవిధానాన్ని సమర్ధించుతూన్న భూస్వాములూ, ఇదివరకు, కాంగ్రెసును విచ్ఛిన్నంచేసి బిరుదులుపొందిన జోహుకుములు, హిందూమహాసభ, జస్టిసు, యూనియనిస్టుపార్టీలవారిని కాంగ్రెసువారే ఆహ్వానించుతూ, వారిని పెద్దలుగాచేసి, వారికి కాంగ్రెసులో ముఖ్యస్థానాలిచ్చి, ఎసెంబ్లీలకు అభ్యర్థులుగానిలబెడితే, ఏమనుకోవడమో తెలియడంలేదు. కాంగ్రెసులో అందరికీ స్థానముంది. బీదలకూ, లక్షాధి కార్లకూ - కూలీలకూ, పెట్టుబడిదార్లకూ - రైతులకూ, జమీందార్లకూ- చివరకు నెహ్రూ ఈ మధ్య అన్నట్లు హిందూమహాసభవారికి ముస్లింలీగ ర్లకు, అమెరికన్లకు, బ్రిటిషువారికి - అందరూ పావలాసభ్యులుగా ఉండ వచ్చు. అలాగనిచెప్పి వీరందరినీ గౌరవంచెయ్యడం వారినిస్తుతించడం, చివరకు వారిని తలమీదెక్కించుకోవడంచూస్తే - ఇదెక్కడకు దారితీస్తుం దోనని భయంవేస్తూంది. వారు ధనికులు - కాంగ్రెసుకు డబ్బిచ్చారని చెప్పి వాళ్ళకు స్థానాలు ఇవ్వడం తప్పు.

ప్రశ్న 8. కాంగ్రెసు ఎన్నికలకు నిలబెట్టిన అభ్యర్థుల నియామకాలు ఏమీ బాగా లేవనా? లేక కాంగ్రెసు పార్లమెంటరీబోర్డు పెద్ద లలో ఏమీ నమ్మకం లేకపోవడాన్నా?

జవాబు: పిఠాపురంరాజా విషయం చూడండి, సర్. విజయా విషయం చూడండి. ఒకవైపు జమీందారీ విధానం నశించాలి — అని ప్రకాశం నెహ్రూలు అంటూ, జమీందారీ విధానంమాత్రం నాశనం కాకూ డదు, ఈ విషయంలో మాత్రం కాంగ్రెసుతో నే నేకీభవించను. అని

ఘంటాపథంగా చెప్పిన సర్ విజయాకు కాంగ్రెసు సహాయం చెయ్యడం. ఇలాంటివి ఎన్నో ఉదాహరణలు మీకు తెలుసు. అలాంటి వాళ్ళను ప్రజా ప్రతినిధులుగా నిలబెట్టి సహాయం చెయ్యడం చాలతప్పు. కాంగ్రెసువారు అభ్యర్థులుగా నిలబెట్టినవారిలో ఎవరో కొద్దిమంది మంచివాళ్లు కాకపో వచ్చు. అది సహజమే. కాని ప్రస్తుతం కాంగ్రెసులో ఏకచ్ఛత్రాధిపత్యం వహిస్తూన్న పటేలు—శంకరరావు—పట్టాభిగార్ల వైఖరి చూస్తే ఏలాంటి కుతంత్రం చాణక్యం ఉపయోగించైనాసరే—కాంగ్రెసు ముఖ్యసిద్ధాంతాలను కాకులకూ, గద్దలకూ ఎగరవేసైనాసరే—లీగును, కమ్యూనిస్టులను ఓడించ గలుగుతాం అన్న ఆశ చూపించేవారిని ఎవరినైనాసరే, కాంగ్రెసు బురఖా వేసి వారిని నిలబెడుతున్నారు. వెనుక 1937 లో గూడ కొంతవరకు అవ కాశ వాదులను నిలబెడితే, అందులో ఎంతమంది వ్యక్తి సత్యాగ్రహం లోనూ 1942 లోనూ పాల్గొన్నవారున్నారు? ఎంతమంది యుద్ధకంట్రా క్టర్లుగానూ, దొంగ మార్కెటుదార్లుగానూ మారలేదు? 1937 లో మన ఆంధ్రలో డిస్ట్రిక్టుబోర్డులో, మ్యునిసిపాల్టీలలో ఉన్న కాంగ్రెసువారు కాం గ్రెసుకు వ్యతిరేకులు కాలేదు? ఆ పాఠమేనా నేర్చుకోవద్దా? అవకాశ వాదులూ, స్వార్థపరులూ ఈవేళ కాంగ్రెసులోకి వస్తే రేపు వాళ్ళు ప్రజా సమస్యను పరిష్కరించేటప్పుడు భావిరాజ్యాంగ ప్రణాళికను తయారుచేసే టప్పుడు, వీరందరూ కాంగ్రెసు ఆదర్శాలప్రకారం పనిచేస్తారా అని అను మానం తోచక తప్పదు. అయినా కాంగ్రెసు ఎడల మా దృక్పథం ఇందు వల్ల, ఇవి ఎంత శోచనీయమైనా ఎంతమాత్రం మారలేదు.

కమ్యూనిస్టు ఏ. ఐ. సి. సి. సభ్యులపైనా, రాష్ట్రకాంగ్రెసు సభ్యుల పైనా ప్రయోగింపబడ్డ ఆంక్షలు. కాంగ్రెసు నిర్మాణంననుసరించి పద్ధతికి వ్యతిరేకం కావు. అంతమాత్రాన అవి న్యాయమని సమర్థించడానికి వీల్లేదు. ఆగస్టులో కాంగ్రెసు అసలు కార్యక్రమం అంటూ ఒకదాన్ని ఇచ్చిందా అన్న విషయమే అనుమానాస్పదంగా ఉన్నప్పుడు అటువంటి కార్యక్ర మాన్ని నిస్సందేహంగానూ, స్పష్టంగానూ, ఇచ్చిందని రుజావు చేయ కుండానే నీలాపనిందలు మోపడం—అవి సక్రమంగా విచారణ చేయకుం

డానే కమ్యూనిస్టుల్ని వెలివేయడమూ జరిగింది. నిర్దోషులమీద నేరంమోపి నేరం ఏమిటో ఇదమిత్థం అని చెప్పి అది నిర్ధారణ చేయకుండా అధిక సంఖ్యాకులచేత వాళ్ళను శిక్షించడం—కాంగ్రెసు చట్టప్రకారం సక్రమమే కావచ్చుగాని కాంగ్రెసుయొక్క ప్రధాన సూత్రాలకే, దేశక్షేమానికే, ప్రజా జీవిత ధర్మాలకే వ్యతిరేకం. కాంగ్రెసు అఖిలభారత దేశస్థులందరియొక్క ప్రజాసంస్థ. ఒక పక్షందికాదు, ఒక ముఠావారి సొత్తుకాదు. ఒక వర్గం వాళ్ళ కూటమిగాదు. విన్న నెహ్రూ లాహోరులో ఉపన్యసించినట్లు కాం గ్రెసు సార్వజనిక సంస్థ. అందులో అన్నిపక్షాల వారికీ స్థానంఉంది. ఒక చట్టనిర్మాణ సభలో మాత్రం ఒక రాజకీయపక్షంగా పనిచేస్తుంది తప్ప. ఎల్లప్పుడూ అందరిప్రజలకూ చెందిన ప్రజాస్వామికసంస్థ. ఎన్నికలస్థానాల నుంచి కమ్యూనిస్టులమీద ఆంక్షవేసి వాళ్ళను తొలగించడానికి ఏ. ఐ. సి. సి. కి అధికారంఉంది. ఆ అధికారాన్ననుసరించి అధిక సంఖ్యాకులచేత ఆమోదింపబడే శిక్ష వేశారు.

అంతటితో తృప్తి చెందలేదు. ఇప్పుడున్న సభ్యులను తోసివేసినా ప్రాథమిక సభ్యులనుంచే మళ్ళీ కమ్యూనిస్టులు కమిటీలకు పోటీ చేయ వచ్చునుగా ? ఇది ఎలాగు ఎదుర్కోవడం ? నాలుగణాల సభ్యులుగా చేర డానికి అందరికీ హక్కుఉంది. ప్రతి ప్రాథమిక సభ్యుడికి కాంగ్రెసు కమి టీలకు పోటీ చేయడానికి అధికారంఉంది. కాంగ్రెసుయొక్క ప్రణాళికనే మారిస్తేతప్ప మరి ఏ ఉపాయంచేతగాని, ఏసాకు జెప్పిగాని; ఆహక్కును రద్దుచేయడానికి వీల్లేదు. అయినా ఒక కుంభకోణం చేశారు. ఆంక్షవేసి తొలగించిన ఖాళీస్థానాల్లోగాని మరి ఏకారణంచేత ఖాళీలు వచ్చినా అస్థానా లను పూర్తిజేయడానికిగాని ప్రజాస్వామ్య సూత్రాలప్రకారం, కాంగ్రెసు సాంప్రదాయాల ప్రకారం, ఆనవాయిత ప్రకారం. ఎన్నికలు అవసరంలేదు. అందూ కాంగ్రెసు కమిటీవారు వారి ఇష్టంవచ్చినవారిని అదనంగా నియా మకం చేసుకోవచ్చునన్నారు. ఏమో: తప్పిజారి ఏ కమ్యూనిస్టు బహిరంగం గానో, దొంగతనంగానో ప్రమాదవశాత్తూ దూరిపోవడానికి అవకాశం ఉంటే ఉండవచ్చు. సందుకూడా పూర్తిచేద్దామనిచెప్పిఆగస్టుకార్యక్రమంలో

పాల్గొన్నవారినే నియమించాలి అని శాసనంచేశారు. అబద్ధపుపెండ్లికి ఏదో వాయిద్యం అన్నట్లు, అసలు ఆగస్టుఉద్యమమేలేదు. ఉన్నా అది కాంగ్రెసు పెట్టినదికాదు. ఆంధ్ర సర్క్యులర్‌తో కాంగ్రెస్ కెట్టి సంబంధంలేదు అని గాంధీజీ చెంపపెట్టు పెట్టింతర్వాత దీనికి భాష్యాలమీద భాష్యాలు బయలు దేరి చివరికి కృపాలినీగారు సిద్ధాంతం చెప్పారు. ఏమిటది ? ఆగస్టు ఉద్య మానికి చురుకుగా దోహదం ఇవ్వనివారు మొదలుకొని, ఆగస్టు ఉద్య మంలో జోక్యం కలుగజేసుకోనివారు ఆసలు ఆగస్టు తీర్మానాన్నే వ్యతిరే కించిన వారినందరినీ గూడా మినహాయించమన్నారు. దీనిభావమేమి తిరుమలేశా ?

అభిప్రాయ భేదానికే కాంగ్రెసులో తావులేదు. అటువంటివారు ఏ వ్యతిరేక కార్యం చేయకపోయినాసరే, కాంగ్రెసులో రాజ్యం చేస్తున్న వారి అభిప్రాయాలతో భిన్నాభిప్రాయాలున్నంత మాత్రాన నిరంకు శంగా ఒక అర్ధినెన్ను నమలుపరచి అత్యాచారం, దౌర్జన్యం చెయ్యడం కాకపోతే మరేమిటంటావు ? ప్రజాస్వామికసంఘం అయినటువంటి అఖిలభారత కాంగ్రెసుసభ్యత్వపు నాలుగణాలుచెల్లించి, కాంగ్రెసు ఆదేశం అయిన అహింసాయుత, ధర్మయుతమయిన పూర్ణస్వరాజ్య సంపాదనకు తన నమ్మకం తెలియజేసిన ప్రతి సభ్యునియొక్క అవివ్వాదమయిన హక్కును ఒక కలంపోటుతో రద్దుచెయ్యటం ఏమిన్యాయం ? ఏమి ధర్మం ? జోషీచెప్పినట్లు 30 వేలమంది కమ్యూనిస్టు పావలా సభ్యులను ఏహక్కు లేకుండా కాంగ్రెసు కంచుకోటలో పెట్టి కాళ్ళు చేతులు కట్టి నోటిలో గుడ్డకుక్కి నిర్బంధించడం కాదా ? ఇది ప్రజాస్వామ్యమా - కాంగ్రెసు సాంప్రదాయమా ? రామరాజ్యమా ? నిరంకుశత్వమా - గాంధీ యుగమా ? పటేల్‌గారి రాజ్యమా ? కాంగ్రెసు నాయకత్వం ఏ పంథా తొక్కుతోందో దీంతో మీకు పూర్తిగా బోధపడుతుంది. కాంగ్రెసు రథా నికి నాలుగు చక్రాలు - జిన్నా వినాశనం, కమ్యూనిస్టు నాశనం, నిరంకు శత్వం, రౌడీరాజ్యం ఈవిధంగా - పటేల్ సారధ్యంక్రింద ఈ జగన్నాథ రథం ఎంతమందిని త్రొక్కించుకుపోవలసి ఉందో - ఎక్కడికి పోతుందో

కదా ? సత్యాన్ని, అహింసను, సహనాన్ని, ప్రజా స్వామ్యాన్ని బలితీసు కొంది. ఇంకా ఎన్ని పౌరసత్వహక్కులు నాశనం కావాలసి ఉన్నాయో ?

ఈ సందర్భంలో యింకా కాంగ్రెసులో ప్రాధమిక సభ్యులుగా ఉన్నవారు తమ సభ్యత్వాన్ని వదులుకున్నారంటే ఆశ్చర్యమేముంది ? కాంగ్రెసులో ఉందామాఅంటే ప్రాధమిక హక్కులే నిరాకరించారాయె ! జీవచ్ఛవాల్లాగా ఉండేకంటే బయటికి వచ్చేద్దాంఅంటే చూశారా దేశ ద్రోహులు అనడమా? ఉన్న కమిటీసభ్యులను వెలివేశారు. పోనీ, మిగతా వారినయినా వారిహక్కులి నుపయోగించుకోనిస్తే ప్రజాస్వామ్య నియ మాల ప్రకారం అధిక సంఖ్యాకులకు వారిమీద నమ్మకంఉంటే,వారిని ఎన్నుకుంటారు, లేకపోతే లేదు. కాంగ్రెసు సంస్థలోఉండే, కాంగ్రెసు శిక్షణను పాటిస్తూ నియమాలను శిరసావహిస్తూ తోడి కాంగ్రెస్ సభ్యుని తమ పంథాకు ఒప్పించగలిగి అధిక సంఖ్యాకులచే ఎన్నుకొనబడితే కమిటీలలోకివస్తే రావచ్చుగాక ! అలాచేయక వాళ్ళకన్యాయంచేసి సంస్థ లోంచి లేచి బయిటికి వెళ్ళిపోవడంతప్ప మరో గత్యంతరం లేకండా చేశారు. కమ్యూనిస్టులమీద కసితీర్చుకుందాము అని. రాజాజీ అనుచరులు మీద కోపం తీర్చుకుందాము అని ప్రజాస్వామ్య సూత్రాలకే స్వస్తి చెప్పే స్తోంది కాంగ్రెసునాయకత్వం ! చూచావా ? చిత్రం! ఎంతటి అన్యాయాల కయినా ఒడిగట్టి తన నాయకత్వము నిలబెట్టుకోడమే ప్రప్రధానంగా చూచు కుంటే ప్రజా స్వామ్యానికే ముప్పుతెచ్చిపెట్టి కాంగ్రెసులో నియంతృత్వ విధానాన్ని చిరస్థాయిగా చేయడంకాదా ! కాంగ్రెసు విధానంలో మార్పులు రావాలంటే కాంగ్రెసు మహాసభలోనే అవి ప్రతిపాదించి ఆమోదించ బడాలి. అంతవరకు కాంగ్రెసు ఆశయాలు మార్పుచేయకుండా ఉండడం నిశ్చయం, అనే నమ్మకంతోఉంటే చూచావా, ముఖ్యమయిన మార్పులే దొడ్డిదారిన ఎలా ప్రవేశపెట్టారో ? ఇది ఏమిటనుకోవడం ? కలయో వైష్ణవ మాయయో ! అని గాంధీయే అనుకుంటుంటాడు తప్పకుండా ! !

ప్రశ్న 9. కాంగ్రెసుపై ఆంక్ష తొలగింతర్వాత కాంగ్రెస్ కమిటీలకు ఎన్నికలు జరపలేదని మీకు తెలుసు. ఇదివరకటి 1940-44

నాటి - కాంగ్రెసు కమిటీలలో మీకు విశ్వాసముందికదా. అలాంటప్పుడు ఈనాడు వాటిలో మీకు విశ్వాసం ఎదుకు సడలిపోయింది ?

జవాబు: 1940–44 లో కాంగ్రెసుసంస్థలు పనిచేయిడానికి అవకాశంలేక పోయింది. ఇప్పుడు మళ్ళీపనిచేయడం ఆరంభించాయి. అసలీ సంస్థలన్నీ బహుశ 1937 ఆప్రాంతాల్లో ఎన్నుకోబడి ఉండాలి. ఈకాలంలో ఎన్నో మార్పులు జరిగాయి. మన దేశంలోనూ అంతర్జాతీయ రంగం లోను బ్రహ్మాండమయిన పరివర్తనలు సంభవించేయి. గాంధీ సూత్రాలమీద వ్యక్తి సత్యాగ్రహం జరిగింది. గాంధీ సూత్రాలకు వ్యతిరేకంగా ఆగస్టు ఘటనలు జరిగాయి. పాకిస్థాన్ వినాదం మహమ్మదియ ప్రజానీకంలో జాతీయ అభ్యుదయం స్వతంత్రకాంక్ష తొలిసారి బయలు దేరాయి. సామాన్యప్రజల్లో, పాటకజనంలో జాతీయ చైతన్యం వచ్చింది. ఇన్నిమార్పులు జరిగినప్పుడు కాంగ్రెసులోమాత్రం గద్దెమీద వెనుకటి సజ్జే కదలకుండా శాశ్వతంగా కూర్చుంది. ఈ గద్దెమీద కూర్చున్న పెద్దలం దరూ మొదటినుంచీ కార్మిక కర్షక అభ్యుదయానికి సామ్యవాద ఉద్య మానికి పూర్తిగా వ్యతిరేకులు. 1930 - 37 రోజుల్లో నూతనాభిప్రాయం గలవారుగాని, కాంగ్రెసుసంస్థలో తమ అధికారం, పలుకుబడిని ప్రశ్నిం చేవారుగాని ఈ కమిటీలలో ఎన్నికలద్వారాగూడా, ప్రవేశించకుండా, ఎన్నో అడ్డంకులు కలిగించారు. కాంగ్రెసు కమిటీల ఎన్నికలలో ఎన్ని అక్రమాలు జరిగినా, ఎన్ని రుజువులు వచ్చినా, వారు తమ పక్షంవారినే సమర్థిం చుతూ వచ్చారు. మచ్చుకు, ఒక్కవిషయంలోనైనా సోషలిస్టులనుగాని, యువకులనుగాని, సమర్థించలేదు, చివరకు, పోటీ కాంగ్రెసు కమిటీలను పెట్టిన వారినిగూడా సమర్థించి, యువకులను త్రోసిపుచ్చారు, వాళ్ళే ఇప్పుడుకూడా కాంగ్రెసును నడుపుతున్నారు. అధికారాపేక్షనే కేవలం వాంఛించేవారు కమ్యూనిస్టు వ్యతిరేకులు - ఇటువంటి వాళ్ళతో నిండిఉన్న కమిటీలమీద నమ్మకం ఎలాఉంటుంది ? మనదేశపు రాజకీయ జీవితంలో ఇటువంటి మహాసమయంలో ప్రజాస్వామ్య సూత్రాలను త్రోసిపుచ్చి కమ్యూనిస్టులు, పాకిస్థాన్ అభిమానులు - రాజాజీపక్షం వాళ్లూ ఎక్కడ

దూరిపోతారో అనిచెప్పి పాతబడి. బూజుపట్టిన కమిటీల నట్లానేఉంచి, ఎన్నికలను జరపకుండా, ఖాళీస్థానాల్లో తమ స్వపక్షులవారినే నియమించి కార్యకలాపాలు నడిపించడంచూస్తే ఈసంస్థలలో నమ్మకం ఎట్లా ఉంటుంది ?

ప్రశ్న 10. కాంగ్రెసు ఎన్నికల ప్రణాళిక బాగులేదనా ? కాంగ్రెసు ఆర్థిక ప్రణాళిక బాగుండదనా ?

జవాబు : కాంగ్రెసు ఎన్నికలప్రణాళిక అంగీకరించడానికిగాని, తీవ్రంగా వ్యతిరేకించడానికిగాని, ఏమీ అంత గొప్పప్రణాళిక కాదు. కాంగ్రెసు పాత చరిత్రే అంతా విశదీకరించారు. ఇప్పుడూ ఇదే ప్రణాళిక ; 1937 లోనూ ఇదే ప్రణాళిక. మేం 1917 లో హోమురూల్ రోజుల్లో ఆందోళన చేసినప్పుడూ ఈప్రణాళికే. ఏవిషయంలోనుకూడా విస్పష్టంగా వ్రాయలేదు. ఎందుచేత ? కాంగ్రెసు గమ్యస్థానం ఏమిటయ్యా—స్వరాజ్యం: ఆ గమ్యస్థానానికే ఇన్నాళ్లూ కాంగ్రెసు పాటుబడుతూంది కదా. మన్ని గమ్యస్థానానికి ఎందువల్ల చేర్పించలేక పోయింది ? మూడోవాడు మన దేశంలో కూర్చున్నాడు కాబట్టి అంటారు. వెనుక హిందూ ముస్లింఐక్యత సాధించింతర్వాతే మూడోవాడిని తరిమివేయగలుగుతామన్నారు, ఇప్పుడు మనలో మనం కొట్లాడుకొంటూంటే మూడోవాడిని బయటికి నెట్టేయ గలిగేది ఎలా ? అని ప్రశ్నించితే "అదంతా ఇప్పుడెందుకు ? మాకు నీ వోటు ఇయ్యి—అప్పుడు చూడు ! స్వరాజ్యం ఎట్లా ఉంటుందయ్యా ? అదంతా ఇప్పుడెందుకు ?" అంటున్నారు.

అలాగంటే ఎలాగు, ఏదో మీరు చెప్పాలి గాని ! అయితే సరే. 1929 లో లాహోరులోనూ, తర్వాత కరాచీలోనూ అప్పుడే చెప్పేశాం. కావలిస్తే పోయి పాతకాగితాలు తిరగవేసి చదువుకోండి ! ఇది ! అయితే జాతీయ ప్రణాళిక తయారు చేయలేదని మేం కాంగ్రెసు మీద నిందవేయ డం లేదు. అలాంటి ప్రణాళిక తయారు చేయాలంటే అధికారం చేతిలో ఉంటేగాని తయారు చెయ్యలేరు. అఖిలభారతావనికి వర్తించే జాతీయ ప్రణాళిక తయారుచేయాలంటే ప్రతి చిన్న విషయం గురించి మన ఆశ?

యాలని మనం తెలుసుకుని ఉండాలి. అలాంటి నిస్పష్టమైన అభిప్రాయాలు కాంగ్రెసుకులేవు. కాంగ్రెసు అన్ని అభిప్రాయాలు గలవారికి తావు ఇస్తుంది కనక ఇప్పట్లో తన అభిప్రాయాలను ఇదమిద్ధమని నొక్కి చెప్ప జాలదు. అంతేకాదు, ఏమంటే ఎవరికి కోపం వస్తుందో ఎవరు కాంగ్రెసు లోంచి లేచిపోతారో ! అని ఒక భయం. చివరకి ఈ భయం ఎంతవరకు పోయిందంటే ప్రపంచం అంతటా నిరాఘాటంగో కార్మిక కర్షక వర్గాల్లో అమలు జరుగుతున్న అనేక ముఖ్యమైన విషయాల్లోగూడ—వారానికి 45 గంటలే పనిచేయడం, జమీందారీ విధానాన్ని రద్దుచేయడం, ప్రతి కర్షకుడికీ తమ సొంత భుక్తంక్రింద కొంత భూమి ఇవ్వడం—ఆదాయపుపన్నులు అనేకరెట్లు హెచ్చుచేయడం—బ్యాంకులూ, రైళ్లూ, ఉక్కూ, ఇనుమూ, బట్టలూ, బొగ్గు ఇటువంటి కీలక పరిశ్రమలు గవర్నమెంటే వశపఱ్చుకొని పనిచేయడం, అధికారయుతంగా ఈ ఆశయాలు కాంగ్రెసు ఆశయాలని చివరకు ఎందుకూ పనికిరాని (?) ఎన్నిక ప్రణాళికలోగూడ ఉచ్చరించడానికే భయం !! ఇది గమనించే కిసాన్ సభలనూ, ట్రేడు యూనియన్లనూ పూర్వం వేరుగానే స్థాపించమన్నారు. ఇప్పుడు అవి తమచెప్పుచేతుల్లోంచి జారిపోతున్నాయని చెప్పి వాటికి పోటీ సంఘాలను పెట్టమంటున్నారు.

ప్రశ్న 11. క్విట్ ఇండియా నినాదానికి మీ రెందుకు అభ్యంతర పెడుతారు?

జవాబు : క్విట్ ఇండియా నినాదాన్ని గురించి మా కెంతమాత్రం వ్యతిరేకం లేదు. బ్రిటిషువారిని చిరస్థాయిగా మన దేశంలో ఉండమని ఏ పక్షంవారూ కోరడంలేదు. ఇంతకూ వార్ని లేచిపొమ్మని ఎన్ని సంవత్సరాలనుండో అంటున్నాం. అంచేత ఇందులో కొత్తగానీ, కాంగ్రెసు యొక్క ప్రత్యేకతగానీ ఏమీ లేదు. అయితే ఒక విషయం. క్విట్ ఇండియా అనేది ఒక నినాదం - అంతమాత్రమే. వెనుక గాంధీజీ ఇచ్చాడు పిలుపులు. సంవత్సరంలో స్వరాజ్యం ! ఉప్పు కొఠారులమీద దాడి చేద్దాం ! యుద్ధ సహాయం చేయం ! 'కరేంగేయా మరేంగే' క్విట్ ఇండియా ! ఇవన్నీ నినాదాలు ! నాదాలు - చప్పుడులు - వేడిగాలి - హాత్ హూత్ - !. అంతే-వీట్లలో పెద్ద మునిగిపోయిందీలేదు - చేసిందీలేదు. మనం నినాదాలు

మారు ప్రమోగించినంత మాత్రాన్నే బ్రిటిషువారు వెళ్ళిపోరే - వాళ్ళను వెళ్లే టట్లు చేయడం ఏలాగ ? అదీ సమస్య. అది పరిష్కారం చేయడానికి మార్గమేది ? ఉత్త బెదిరింపులతో లాభంలేదు. మంత్రాలకే చింతకాయలు రాలుతాయా ? స్వరాజ్యం సాధించడానికి హిందూ ముస్లిం సంఘటన ప్రధమం అన్న వెనుకటి సూత్రాన్ని మానేసి ఐక్యంమాట తర్వాత చూసు కుందాం : ముందు బ్రిటిషువారిని వెళ్ళగొట్టాలి అని గాంధీజీ అనడం హిమాలయం అంత అపచారం. ఇలా అనడంతోనే ప్రారంభం అయింది పాకీస్తాన్ కోరిక. ఐక్యతకోసం ప్రాకులాడడంపోయి, ఎంత అనైక్యత కలిగిస్తే అంత దేశభక్తి పరాయణత్వం అన్న అపభ్రంశంలోకి దిగి పోయాం. హిందూమహాసభను దువ్వడం, జాతీయ ముస్లింలు అని కొందరు పానకంలో పుడకల్ని విశ్వామిత్ర సృష్టి చేయడము. స్వయం నిర్ణయ సూత్రానికి అపార్థాలు కల్పించి, రాష్ట్ర స్వపరిపాలన అవి నిర్వచనం చెప్పడం. ఫెడరలు విధానం దేశానర్ధదాయకం అని సైమను కమీషను వాటినుంచి తోసివేసిందానిని ఇప్పుడు మళ్ళీ తీసుకురావడం. చివరకు ముస్లింలలో ముస్లింలకు అంతర్యుద్ధాలు కల్పించి, లీగును నాశనం చేయ బోవడం, లీగు శవంమీదనుంచే మేం స్వరాజ్యంకోసం సాగిపోతాం అన డం - ఇది క్విట్ ఇండియాలో అంతరార్థం. 1942 లో ఈ వినాదం ఇచ్చినప్పుడు ఎంతమంది జాతీయ ముస్లింలు ఈ పిలుపు నంగీకరించారు? ఎందుకు అంగీకరించలేదు ? మంచో చెడో - ఉందో, అకారణంగానో, హిందువులంటే ముస్లింలలో అధిక సంఖ్యాకులకి భయం, అపనమ్మకం ఉంది. బెదిరింపులవల్ల, బలాత్కారంవల్ల, భయపెట్టడంవల్ల బూచిబూచి అని జడిపింపులవల్ల అపనమ్మకం పోదుగదా, మరింత హెచ్చుతుంది. ఇది దూరదృష్టి కాదు- రాజకీయ ధర్మంకాదు. చారిత్రాత్మకంగా చూద్దాం. ముస్లింలీగు మొట్టమొదటి రోజుల్లో బ్రిటిషువారిచే ప్రోత్సహింపబడి ఉండవచ్చును గాక ! అరవై ఏండ్లక్రింద కాంగ్రెసు స్థాపకులు ఎవరు ? అప్పుడు కాంగ్రెసు అధ్యక్షులు ఎవరై వుండేవారు ? వారు ఏ దుస్తులు వేసికొని కాంగ్రెసుకు వచ్చేవారు ? ఏ భాషలో కాంగ్రెసు ఉపన్యాసం

ఇచ్చేవారు ? అయితే కాంగ్రెసు పూర్ణస్వరాజ్యం ఆశయం వెలిబుచ్చ టానికి ఇన్ని సంవత్సరాల పరిణామక్రమం పొందవలసివచ్చింది. అలాగే లీగు కూడా మొదట మన పాలకులకు సహాయపడుతూ వచ్చినా, ఈనాటికి కాంగ్రెసులాగే ఆ సంస్థకూడా సంపూర్ణ స్వరాజ్యం కావాలని అంటుంది. హిందూ మహాసభ మొదటినుంచీ గవర్నమెంటు నవుకర్లే అందులో ప్రముఖుల్లు. ఈ రోజువరకు వైస్రాయి కార్యవర్గంలోని సభ్యులూ, మహారాజులూ, బిరుదాంకితులూ ! గాంధీజీని, కాంగ్రెసును తిట్టనిరోజు లేదు సావర్కారుకు ! కాంగ్రెసు అహింసఅంటే ఛట్ పనికి రాదు. మిలిటరీ తరిఫీదు కావాలి అంటున్నారు. కాంగ్రెసు డొమినియన్ ప్రతిపత్తి అంటే బాధ్యతాయుత స్వపరిపాలన అన్నారు, తర్వాత కాంగ్రెసు స్వరాజ్యం అంటే పనికిరాదు. డొమీనియన్ ప్రతిపత్తి చాలు అన్నారు. కాంగ్రెసు పూర్ణ స్వరాజ్యం అంటే పనికిరాదు స్వరాజ్యం చాలు అన్నారు, కాంగ్రెసు యుద్ధసహాయంకూడదు, అంటే తప్పకుండా సహాయంచెయ్యాలి మిలిటరీలో చేరండి. మిలిటరీకాలేజీలు పెడదాం, అని చెప్పి బ్రిటిష్ యుద్ధానికి రిక్రూటింగు ఏజెంట్లకంటె హెచ్చు మద్దతు ఇచ్చి, యుద్ధానికి సర్వతోముఖమైన సహాయం జేశారు. వ్యక్తి సత్యాగ్రహాన్ని హాస్యంచేసి తూలనాడారు. 1942 లో కరేంగే - యా - మరేంగే అంటే హిందూమహా సభ వారు కరేంలేదు, మరేంలేదు. 1945 లో శ్యాంప్రసాద్ ముఖర్జీ అధ్య క్షత క్రిందకదా, మహాసభవారు పూర్ణ స్వరాజ్యం మా ఆశయం అని అన్నది ? ఇటువంటి దేశభక్తులను ఈ వేళ దువ్వుతూ, బుజ్జగిస్తూ బ్రతి మాలు కుంటూ, ఎన్నికల్లో వారికి ప్రత్యర్థుల్ని నిలపకుండా లాలోచీపడి తనలో కలుపుకుంటుంది కాంగ్రెసు. లీగువారు మాత్రం దేశద్రోహు లయారు ! ఏమి సబబు ! ఏమిన్యాయం. ఇటువంటి సహాయం కోరుతూ లీగుమీద పూర్ణయుద్ధం ప్రకటిస్తే అధికసంఖ్యాకులు అయిన లీగు మహమ్మ దీయులకు కాంగ్రెసుమీద నమ్మకం ఎలా ఉంటుంది ? స్వయంనిర్ణయాధి కారం మీకు ఇస్తాం, అని ఖరారు చేస్తేమాత్రం లీగుకు ఎల్లా నమ్మకం కుదిరింది ? పోనీ సిమ్లాలో ఏమయింది ? జాతీయ మహమ్మదీయులకు

ఒక స్థానం కావాలని కాంగ్రెసు పట్టుబట్టడం చేతగదా భగ్నమయింది? కాంగ్రెసు మహామ్మదీయులేంటయ్యా. అయితే మహమ్మదీయుయి కావాలి లేకపోతే కాంగ్రెసువారుకావాలి. ఆవుపెయ్య కావాలి, లేకపోతే కోడెపెయ్యో కావాలి. అదీకాక, ఇదీకాకా చేటపెయ్య అయితే ఎట్టా? అంటే అష్ట్రమ్మె కాంగ్రెసు నిన్నాళ్లా నమ్ముకున్నారు. వాళ్ళకు మనం ఏదో దారి చూపించి ఒక పదవేనా పారెయ్యకపోతే ఎట్లా? అన్నారు. సరిగ్గా బ్రిటిషు సామ్రాజ్య వాదులు చెప్పేటట్లే. పాపం ఈ ఐరోపియన్ ఎసోషియన్‌వారు, ఐరోపియన్ వర్తకశాఖవారు, ప్లాంటర్లు ఐ. సి, యస్. వారు, బ్రిటిషు సామ్రాజ్యాన్ని కనిపెట్టుకుని ఇన్నాళ్ళూ ఏ గడ్డి కరవమంటే ఆ గడ్డి కరుస్తూ జమీందారీ అనుచరులైన కాసావాళ్ళలాగు వాళ్ళకి ఏదైనా ముట్టచెప్పకపోతే వాళ్ళు ఎలా ఏడుస్తారు అంటూ, వాళ్ళకి రక్షణలుఅంటూ ఒకకేంకు కనిపెడుతూ ఉన్నారే—అలాగే, అక్షరాలా? ఏమేనా అంటే జిన్నా మన నాయకులను అవమానం చేశాడు అనడం, బ్రిటిషువారు కాంగ్రెసును మొదటి రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్సులో అవమానం చేశారా? గౌరవం చేశారా? రెండవ రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్సుకు ఎందుకు వెళ్ళేరు? అక్కడ ఆ తర్వాత మీకు అవమానం జరిగిందా, మరేం జరిగింది? గాంధీ ఇర్విన్ సమాధానం కోసం అవమానం జరిగిందనే వెళ్ళేరా? గౌరవించారనే వెళ్ళేరా? బ్రిటిషువారు మన్ని మర్యాద చేయలేదని తూలనాడేరని, హింసించేరని, వ్యక్తి సత్యాగ్రహం ఎందుకు విరమించేరు? ఇన్ని అవమానాలు జరిగినా, వేవెలను శ్లాఘించి ఆత్మస్తుతిచేసి, ఇచ్చకాలాడి, మోటారుకార్లిచ్చారని, విందులు చేశారని, కోటలో బసయిచ్చారనీ ఎందుకు పొగిడారు? నెహ్రూ, పట్టాభి, పటేలులు దుడ్డుకర్రవాదం బోధిస్తున్నారనీ అటువంటి ధోరణి కాంగ్రెసు ముఖ్యసూత్రాలకే వ్యతిరేకమనీ మీరే ఒప్పుకుంటున్నారుగా? వాళ్ళు అలాగ నోటికి వచ్చినట్లు, ఓర్పు, క్షమ. సత్యాగ్రహాలకు స్వస్తిచెప్పి, అహింసావాదాన్ని మంట గలుపుతున్నారన్నంత మాత్రాన మేం కాంగ్రెసులోంచి వెళ్ళిపోవడం లేదు. ఎన్నికల ప్రచారంలో కొంతవరకు మినహాయింపు ఇవ్వడం సబబే నువ్వు చెప్పినట్లు. అయితే

ఎన్నికల రభస ఇంకా ప్రారంభమే కాలేదు సరికదా, ఈ ఉపన్యాసాలు వాళ్లు విడుదలైన ఉత్తరక్షణం నుంచి మొదలుపెట్టేరు. కాంగ్రెసు వర్కింగు కమిటీవారే ఈ విధంగా ప్రతిరోజూ విధివిరామం లేకుండా మాట్లాడుతుంటే ఇది కాంగ్రెసు నిజస్వరూపమేనని తప్పక తేలుతుంది. ఇది ఎక్కడికి తీసుకుపోతుందో చూడు! నెహ్రూ జైలునుంచి వచ్చిన మొదటిరోజే మాట్లాడుతూ, కమ్యూనిస్టుల ప్రవర్తన గురించి నేను భోగట్టా చేసింతర్వాత కాని, ఏమీ మాట్టాడ తలుచుకో లేదన్నాడు. ఆ మర్నాడే మొదలుపెట్టాడు దేశద్రోహం అంటూ. ఆ వెంటనే లాహోరులో ఏమి టండీ ఆ ద్రోహం? అంటే, ఆ, అలాకాదు. ఎదుటిపక్షం వారితో చేరి పోయారు అన్నారు. ఉదహరించగలరా? అని నిక్కచ్చిగా ప్రశ్నిస్తే, ప్రత్యక్షంగా కాకపోయినా మానసికంగా ఎదుటివారితో లాలోచీపడిపోయా రని అన్నాడు, ఇక ఆ రోజునుంచి మొదలు! ఇక కమ్యూనిస్టులను అడి పోయడానికి! జవహార్‌లాలుకు కోపం, మానసిక గర్వం జాస్తి. దాంతో ఇష్టంవచ్చినట్టు అంటున్నాడు. అంతకంటె ఏడోకాలంలో మొదలుపెట్టారు పట్టాభిగారు. ఆంధ్రసర్క్యులరును గురించి వారు చెప్పిన అవాకులు చెవా కులు. దానిమీద గాంధీజీ చీవాట్లు పెట్టడం, ఆ పరాభవం సహింకోలేక కాబోలు అక్కడనుంచి తన నూతన అహింసాతత్వం, భాష్యం మొదలు పెట్టాడు! బ్రిటీషు గవర్నమెంటును ఎదుర్కోటానికి అహింస! కమ్యూ నిస్టులపైన హింసట! ఎంత సిగ్గుచేటో చూడు! ఈ మాటలు గాంధీ భాష్యకారుని నోటినుండిరావలసి మాటలేనా? ఇక ఆమహానుభావుడు పటేలు చూడు! లీగుమీద విషమేకదా కక్కడం! దైనందినచర్య అయిపోయింది. బ్రిటీషువారి గులాములట? వారి తాబేదార్లట! వారికి స్వరాజ్యం, స్వతంత్రం అక్కరలేదట! వారిని నాశనం చేయాలట! ఇలాగంటూనే హిందూమహా సభ వారిని కాంగ్రెసులోకి రమ్మనడం, మహాసభకూ, కాంగ్రెసుకూ భేధం లేదనడం మనం ఇద్దరం కలిసి, లీగును ధ్వంసం చేస్తామనడం, కాంగ్రె సుతో మచ్చుకు ఒక్కసారయినాకూడా- ఏ విషయంలోనూ కలిసి పనిచేయ నిరాకరించిన వారు వీరు! సిమ్లాలో హిందూమహాసభకుకూడా ఒక

మంత్రిపదవి ఇమ్మన్నారు కాంగ్రెసువారు ! లీగును నాశనం చేయడానికి ఎవరెని లేవదీశారయా ; అహ్రార్లని, ఎవరయ్యా వీరు ? రేపు పొద్దున స్వయంనిర్ణయ సూత్రం ప్రకారం మహమ్మదీయులు అధిక సంఖ్యాకులు గల రాష్ట్రాలలో ఖురాను ప్రకారమే పరిపాలన చెయ్యాలని, ఆందోళన చేసే అభ్యుదయధీరులు. ఒకనోటితో పాకీస్తాన్‌లో హిందువులను అణగ త్రొక్కేస్తారని ప్రచారం, రెండవ నాలుకతో ఖురాను రాజ్యం కావాలనే ఛాందసులను లీగుకు వ్యతిరేకంగా నిలబెట్టడం ! దీనితో లీగువాళ్ళు, అహ్రార్లు ఒకరిమీద ఒకరు అత్యాచారాలు, దౌర్జన్యాలు చేసుకోవడం ! ఈ చాణుక్య లాఠీభాష్యం ఇంతటితో ఆగిందా, చూడు. మధురలో కాంగ్రెసువాదుల సభలో రాజాజీ పక్షంవారిమీద కామరాజునాడారు పక్షం వారు ఎల్లా దౌర్జన్యాలు సాగించారో ? దీనికి అంతం ఉంటుందంటావా ? ఇప్పుడు కాంగ్రెసువారు హింసావాదులనీ, రౌడీలనీ ఉపయోగించుతున్నారే రేపు వీళ్ళు కాంగ్రెసుమీదికి తిరుగబడరా ? నెహ్రూ చూడు ! ప్రతి ఉపన్యాసంలోనూ లీగుమీద మీసందువ్వి సవారి చేయడమేకదా ? ఇలా దౌర్జన్యానికి రెచ్చగొడితే ఇక జాతీయ జీవితంలో అహింస, సత్యం, వీటికి తావు ఏదీ ? ఈ అహింసా నూతన భాష్యం ఫలితంగా కాంగ్రెసు కమ్యూనిస్టు కొట్లాటలు - హిందూ మహమ్మదీయ కొట్లాటలు, లీగు - జాతీయ ముస్లింల కొట్లాటలు, కార్మికుల - రౌడీల కొట్లాటలు, కిసానూ- జమీందార్ల కొట్లాటలు, యూనియనిస్టులు - లీగర్ల కొట్లాటలు, కాంగ్రెసు- హరిజనులూ - నిమ్నజాతుల కొట్లాటలు - కాంగ్రెసు వాళ్ళలో కాంగ్రెసు వాళ్ళ కొట్లాట. నే నేమీ హెచ్చించి చెప్పడంలేదుసుమా ? పత్రికలు చదువుతున్నవారందరకూ ఇది తెలుసును. ఇన్ని కలహాలకు దారితీసింది ఇప్పటి కాంగ్రెసు ప్రచారం ! ఇంత అనైక్యత కల్పించికూడా, బ్రిటిషు వారినికాంగ్రెసు ఒక్క చేతితో తరిమివేయగలదంటే ఎలా సాధ్యం !

వాడిని పొగిడేరే - అవమానం అయిందా గౌరవం అయిందా ? జిన్నా అమర్యాద జేశాడనీ, అతని ఇంటికి వెళ్ళితే చాప వెయ్యలేదనీ, బొట్టుపెట్టి తాంబూలం ఇవ్వలేదనీ ఇవన్నీ చంటిపిల్లల చిలిపి కయ్యాలు

కాకపోతే రెండు ప్రధాన రాజకీయసంస్థలు ప్రవర్తించవలసిన ప్రవర్తనలా? జిన్నా ఎన్ని అవమానాలు చేసినాసరే - బ్రిటిషువారి దగ్గరికి వెళ్ళగలిగి నప్పుడు - స్వరాజ్య సాధనకోసం - జాతీయైక్యతకోసం - 40 కోట్ల ప్రజానీకం కోసం, జిన్నావద్దకు యెందుకు వెళ్ళకూడదు? మన గర్భ శత్రువు ఎన్నటికీ మన కపకారం తప్ప ఉపకారం ఎందుకు చేస్తాడు? మన్ని దూరంగా ఉంచి మనలో చీలికలు కల్పించి మనమీద రాజ్యం చేయు దాం అనేవారితో మనం మానావమానాలు, గౌరవ మర్యాదలూ పాటించ కుండా సంప్రతిస్తున్నామే? అటువంటప్పుడు మనతోడి సోదరునితో, మనకు గౌరవహీనమా? ఏమిటీ విపరీతం? శత్రువుని పొగడ్డం, శరణ్యార్థం వాడి కాళ్ళమీద పడ్డం, తోడి సోదర కుటుంబంలో చీలికలు ప్రేరేపించడం. అనైక్యతే సంఘబలము, దేశ క్షేమం, అనడం. ఒక నాలుకతో కులమత సంస్థలను ఖండించడం, మరొక నాలుకతో ఒక కులసంస్థతో లాలోచీపడి, రెండవ కులసంస్థను నాశనం చేయడానికి పన్నాగం పన్నడం భేదాభిప్రాయాలు గలవారి నందరినీ దేశద్రోహులని దుమ్మెత్తిపోయడం. ఈ విధంగా అంతర్యుద్ధాలు, కులమత వైషమ్యాలు, రేకెత్తించి అంతఃశత్రువులను చీల్చి చెండాడి ఎలాగో ఒకలాగున, బ్రిటిషువారిని తరిమివేస్తామనడం వెర్రి ఆశ! ఇది క్విట్ఇండియా వినాదం అంతే! ఎలాగో ఒకలాగు ఎలాగయ్యా!? ఏముందీ. ఎన్నిక ల్లోనా జిన్నాను ఓడించేస్తాంకదా? రాష్ట్రాల్లో కాంగ్రెసు రాజ్యాలను ఏర్పరచేస్తాం - అక్కడనుంచి రాజ్యాంగ పరిషత్తుకు వెళుతాం. అక్కడ పూర్ణ స్వరాజ్య ప్రణాళిక తయారుచేస్తాం. దాంతో అఖండ హిందూస్థాన్ స్వరాజ్యం వచ్చేస్తుంది. బ్రిటిషువాడు మూటముల్లె కట్టుకు వెళ్ళిపోతాడు. అంతా మనం చెప్పినట్లే జరుగుతుందని కలలుగంటున్నాం: ఏమీ వాడంత వెర్రివాడా? పనసపండు విప్పి మన చేతిలో పెట్టడానికి? ఆఁ: బ్రిటిష్ వాడు మంచివాడే, - జిన్నా అడ్డుపడుతున్నాడు కానీ లేకపోతే సిమ్లాలోనే మన కిచ్చేవాడు స్వరాజ్యం అని జవాబు! ఇంత వెర్రితన ఎక్కడయినా ఉంటుందా? బ్రిటిషువాడికి మనమీద ఇంతప్రేమ ఎన్నాళ్ళనుంచి

వచ్చింది. మనకంత సదుపాయంచేసి పెట్టడానికి, వాడి రాజ్యాంగతంత్రం మనం చూడడంలేదూ ? ఈనాడు గ్రీసులో, ఇటలీలో, యుగోస్లేవియాలో, బెల్జియంలో, పోలండులో, పాలస్తయినాలో, చైనాలో, ఇండోచైనాలో ఇండోనేషియాలో....? ఇదివరకు రౌండ్ టేబుల్ సమావేశాలలో ఏమైందో యీమాటు ప్రజా పరిషత్తులలో, అదే అవుతుంది. మనలో మనకు మనస్పర్ధలుపుట్టి, చీలికలుపుట్టి అనైక్యతతో ఒక తాటిమీద నిలవ లేకపోతే, మనమధ్య తను మధ్యవర్తిగా వ్యవహరించి మన అందరినెత్తి మీద ఆ కూప్లండు ప్లానును రుద్దుతాడు ! ఇది కాంగ్రెస్ చూడ్డంలేదు. క్విటిండియా నినాదం ఇంకా మన నెక్కడికి తీసుకుపోయింది ? 1942 కరేంగే-యా-మరేంగే అన్నాం. బ్రిటిష్‌వారితో పోరాటం సాగించేం. జపానువారితో చేతులు కలిపి బ్రిటిష్‌వారిని ఓడించి, జపానువారిని మన దేశంనుండి పారద్రోలి స్వరాజ్యం సంపాదించేంతవరకు జరిగింది. యుద్ధంలో పూర్తి సానుభూతి ఉందంటూ, రష్యా, చైనాల ప్రమాదావస్థకు సానుభూతి ఉందంటూ నాజీజం నశించాలంటూ, జపాను జయించకూడ దంటూ, క్విట్ ఇండియా నినాదంతో, ఇదంతా మర్చిపోయి. జపాను సాయం తీసుకుంటే తప్పేమిటి ? అన్నాం. ఆంధ్ర సర్క్యులరు అహింస సత్యాగ్రహాలను మరిపించేసింది, గాంధీజీని మూలపెట్టేశాం. అతనిస్థానే బోసు నారాధిస్తున్నాం ? పిల్లిమీద ఎలుక నెక్కించడం, ఎలుకమీద పిల్లి నెక్కించడం : హిందూమహాసభతో చేతులు కలపడం, లీగుమీద జాతీయ ముస్లింలని, కమ్యూనిస్టులమీద పెట్టుబడిదార్ల తాబేదార్లని, కిసాన్‌లమీద జమీందార్లనీ, కాంగ్రెసు వాదులను ఖైదులోపెట్టి హింసిస్తున్న యూనియ నిష్టులతో భుజాలు భుజాలు రాసుకొని, వాళ్ళని అప్రార్లమ లీగర్లమీది కెక్కించడం-ఇది పిల్లిమీదఎలుక, ఎలకమీదపిల్లి ! ఆంధ్రరాష్ట్రం ఇచ్చాడు కాదని రాజాజీని తిట్టడం, రాజాజీని పడద్రొయ్యడానికి ప్రకాశం పట్టాభి ఏకంగావడం; భాషాప్రయుక్త రాష్ట్రాల నిర్మిస్తాం అని కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికలో వ్రాయటం, 24 గంటలు కాకుండానే చెన్నపట్నంలో ఉపన్యసిస్తూ రేపు కాంగ్రెసు మంత్రిపదవులు స్వీకరిస్తే ఆంధ్రజిల్లాల

ఆదాయవ్యయాలు, మొత్తం బడ్జెటునుంచి ప్రస్తుతం ప్రత్యేకించ నవసరం లేదు అనడం. అలా అని తమిళసోదరుల ఓట్లకోసం ప్రాకులాడి, ఒక్క-స్పీచితో రాజాజీని చిత్తుచేయడానికి తంత్రం పన్నడం :....ఎలుకమీద పిల్లి, పిల్లి మీద ఎలుక ; క్విట్ ఇండియా ఎతవరకు వెళుతుందోచూడు ; ధర్మక్షేత్రే - కురుక్షేత్రే మా ఐదుఊళ్ళు మాకు పంచేయండన్నారు పాండవులు. ససేమిరా, మేం పంచిపెట్టం మాతోనే మీరు కట్టకట్టుకొని ఉండా లన్నారు కౌరవులు. ధర్మమా ? పిత్రార్జితం—పంచిపెట్టండన్నారు పాండవులు. ట్రస్టీషిప్పు, అయితే ధర్మయుద్ధం చేస్తామన్నారు పాండవులు. ధర్మ యుద్ధంలో గెలిచారు. అవి భగవద్గీతరోజులు. 1941 తో అవిపోయాయి. ఈనాడు గాంధీజీయే మూలకు నెట్టివేయబడ్డాడుగా - బ్రిటిషువాడింకా క్విట్ ఇండియా కానేలేదు. ఢిల్లీ చాలావ్ అంటున్నాడు నెహ్రూ. పాపం నిజమే ననుకొని ఆమె ఎవరో వెర్రిబాగుల తల్లి బీహారునుంచి ఢిల్లీనడిచి బయలు దేరింది !!!

భరతా, క్షమించు. ఇక్కడనీవు పూర్తిగా పొరబడుతున్నావు. కాంగ్రెసునాయకు లేమంటున్నారంటే. (1) కాంగ్రెసు ఒక్కటే జాతీయ సంస్థ. (2) ముస్లింలీగు కమ్యూనిస్టుపార్టీలు కాంగ్రెసు వ్యతిరేకసంస్థలు కాబట్టి. (3) వాటిలో చేరడం దేశద్రోహం అంటున్నారు. ఈ హేతు వాదం సరిగానే వున్నట్లు కన్పించవచ్చు. కాని అసలు పై రెండు సూత్రాలు సత్యదూరాలు. అంచేత తాత్పర్యంకూడ తప్పే. మొదటిది : వయస్సు లోనూ, సభ్యత్వంలోనూ, కార్యదీక్షలోనూ, త్యాగంలోనూ, కాంగ్రెసు ప్రథమస్థానం వహిస్తుంది. అన్ని రాజకీయ సంస్థలకంటే అదే ముందు పూర్ణస్వరాజ్యం ప్రకటించింది. అందుకు పోరాటంసాగించింది. కాంగ్రెసు చరిత్ర జ్ఞాపకం తెచ్చుకో. కాంగ్రెసు ఆదర్శం ఎన్ని మార్పులు చెందిందో ! కొన్ని రోజులు హోంరూల్ తమ ఆశయమన్నారు. డొమినియన్ స్టేటస్ యిస్తే చాలునని 1928 కలకత్తా కాంగ్రెసులో తీర్మానించారు. నాగపూర్ కాంగ్రెసులో హజరతమోహినీ సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానంతెస్తే ఓడి

పోయింది. కలకత్తాకాంగ్రెసులోకూడా సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానం ఓడిపోయింది.

బ్రిటిషువారికిఒక సంవత్సరంగడువు ఇచ్చింతర్వాత 1929 లాహోరుకాంగ్రెసులోకదా పూర్ణస్వరాజ్యం ప్రకటించింది. కాంగ్రెసుతీసినదారినే మిగతాఅన్ని సంస్థలుగూడ అనుసరించి ఈ నాటికి అన్ని సంస్థలుగూడా తమనిర్మాణాన్ని, కార్యకలాపాలనూ. ప్రాజాస్వామిక సూత్రాలమీదనే నిర్మించి గమ్యస్థానం పూర్ణ స్వరాజ్యం అని ప్రకటించాయి. అంచేత కాంగ్రెసు అన్నిటికంటె బ్రహ్మాండమైన జాతీయసంస్థ అయినప్పటికీ, అది ఒక్కటే జాతీయసంస్థ అనడం పొరపాటు, ముస్లింలు అధికసంఖ్యాకులు కాంగ్రెసులో చేరలేదు. ఈ విషయం ఒప్పుకోడానికి మనకు ఎంత ఇష్టం లేకపోయినా ఒప్పుకొనక తప్పదు. వారిని కాంగ్రెసు ఎందుచేత ఆకర్షించ లేకపోయింది. లీగు ఎందుచేత ఆకర్షించింది. ముస్లిం జనసామాన్యం కోర్కెలు లీగుయొక్క ఆశయాలలో ప్రతిబింబించి నందువల్లే వారు అందులో హెచ్చుగా చేరి, అది తమ జాతీయ సంస్థగా పరిగణిస్తున్నారు. మజ్లీసు, అహ్రార్లు, జాతీయ మహమ్మదీయులు, మోమిన్లు, షియాలూ, ఉలేమాలు ఇవన్నీ వున్నా మహమ్మదీయ ప్రజానీకానికి లీగే తల్లి జాతీయ సంస్థ అని గాంధీజీయే ఒప్పుకున్నాడు. అందుచే గాంధీజీ జిన్నాతో సంప్రదింపులకు వెళ్ళేడు. అందుచేత లీగుకూడా సమాన ప్రతిపత్తిగల దేశభక్తియుత జాతీయసంస్థ అని ఒప్పుకోక తప్పదు. లీగులో చేరిన లక్షలాది ప్రజలు దేశద్రోహులు, బ్రిటిషు తాబేదార్లు అనడం తప్పుకాదా? వారి దేశభక్తిని మనం గౌరవించకుండా వారిని తూలనాడినంతకాలం వాళ్ళు మనతో హృదయంవిప్పి మాట్లాడుతారా? ఏనాడైతే వాళ్ళ దేశభక్తి కాంగ్రెసు గుర్తిస్తుందో ఆనాడు వాళ్ళకి, మనకి రాజీ కుదురుతుంది, అంతేకాని, మనం వాళ్ళని ద్రోహులని, వాళ్ళు మనలని కాఫర్లనీ తిట్టుకుంటూ ఉన్నంతకాలం మన అఖండ హిందూస్థానం చేయడం, వాళ్ళు పాకీస్థాన్ అని నమాజుచేయడం. అందరం బ్రిటిషు చేతుల్లో ఉండడం తప్పదు. మనం, వాళ్లూ ఎప్పుడైతే భాయీ,భాయీ అని పిల్చుకుంటామో

వెంటనే రాజీ కుదురుతుంది. బేరంపై బేరం, పేచీపై పేచీలు పోతాయి. యే గాంధీ రాజాజీ సూత్రమో, స్వయంనిర్ణయ సూత్రమో! వాళ్లూ మనం కూడా సంతోషంగానే ఒప్పుకుంటాం. అంచేత లీగుకూడా ముస్లిం సోదరులయొక్క ప్రధాన రాజకీయ ప్రజాసంస్థఅని, మనం సత్వరంగా గుర్తించాలి. అంచేత ముస్లింలు వారి జాతీయసంస్థలో చేరడం. దేశ ద్రోహం కానేరదు.

ఇక కమ్యూనిస్టులమాట : 1942 తో మన జాతీయ జీవితంకానీ, కాంగ్రెసు చరిత్రకాని ఆరంభం అవడంలేదని మర్చిపోకండి మీరు. 1942 పూర్వపు కాంగ్రెసు చరిత్రను చూచుకొండి. కమ్యూనిస్టులు కాంగ్రెసు బిడ్డలు. కాంగ్రెసులో పుట్టి పెరిగినవారు. వారు రష్యానుంచి దిగి రాలేదు. గాంధీజీ తన సహాయ నిరాకరణ సిద్ధాంతం ఎక్కడనుంచి తెచ్చాడు ? ఆ రష్యన్ టాల్‌స్టాయి దగ్గరనుంచేసుమా ! ఇంద్రియ నిగ్రహం - రాజకీయంలో అహింసా విధానం - యుద్ధ వ్యతిరేకత ఇవన్నీ టాల్‌స్టాయి దగ్గర్నుంచే సుమా నేర్చుకున్నాడు గాంధీజీ. ఈ సంగతి మర్చిపోకూ ! కమ్యూనిస్టులు రష్యా మానసపుత్రులని కాంగ్రెసువాదులు యెత్తిపొడిచినపుడు నవ్వుతూ పైన చెప్పిన గాంధీజీ సంగతి వారితో చెప్పుతూండు ! కమ్యూనిస్టులు బ్రిటిషువాళ్ళదగ్గర లంచంతిన్నారని ఎవరేనా అంటే గాంధీజీ బోయరు యుద్ధంలోనూ, జులూ యుద్ధంలోనూ, 1914 యుద్ధంలోనూ ఏంజేశాడో జ్ఞప్తికి తెచ్చుకొండి ! కమ్యూనిస్టులకు అహింసమీద నమ్మకం లేదని కాంగ్రెసువారు ఎత్తిపొడిస్తే గదరుపార్టీ, కామగాటామారూ, చిటగాంగు, మిడ్నపూరు విప్లవ కారులను జ్ఞాపకం తెచ్చుకొండి. ఈ రోజు పటేలు శరత్‌బాబును కౌగిలించుకోవడం. 1942 లో నెహ్రూ సుభాసును అన్న మాటలు. ఈ నాడు ఆజాద్ హింద్‌ఫౌజును గురించి చేస్తున్న స్తుతి జ్ఞాపకం పెట్టుకుని ఎవరికి అహింసమీద నమ్మకం ఉందో అప్పుడు చెప్పు, అది అలావుంచు. వారిని కాంగ్రెసులోనుంచి ఎలా గెంటేశారో నీకు తెలుసుకదా ! "కమ్యూనిస్టు నాలుగణాల సభ్యులను కాంగ్రెసు పంపించేయలేదే - మీదుమిక్కిలి వారంతట వారే రాజీనామా ఇచ్చి వచ్చేశారుకదా ?" అని నువ్వు ప్రశ్నిస్తున్నావు. అంతేకాదు అలా

కాంగ్రెసునుండి వేరుపడడమే దేశద్రోహమని అంటున్నావుకూడాను. నేను వెనుక వ్రాసింది చూడు. కమ్యూనిస్టు పార్టీపైన వెలివేయుటకు కాంగ్రెసు నిర్మాణ విధానాలు అంగీకరించవు. లేకపోతే ఆపని కాంగ్రెసు చేసేదే ! అంచేత కొట్టా తిట్టావద్దు ! అవి మనమోటు సామెత ప్రకారం కాంగ్రెసులోవారికి, నాలుగణాల సభ్యులకు ఉండే ప్రాథమిక హక్కులనే ఒక 'డిఫెన్సుఆఫ్ ఇండియా' (కాంగ్రెసు యొక్క సొత్తేకదా, ఇండియా అంతా అంచేత ఈపని చేసినా తప్పులేదనేలే. అని కాంగ్రెసు అభిప్రాయం ! ) ఆర్డినెన్సు అమలుచేస్తే వాళ్ళేపోతారు. యెవరము పొమ్మనక్కరలేదు. పీడవదలిపోతుంది. (ఈపీడతో రాజాజీపీడకూడ వదలిపోతుందని చాణక్యం ! ) అని వారికి కాంగ్రెసులో నిలవనీడ లేకుండా చేశారు. ఇలాంటి పరిస్థితుల్లో బయటికిరాక తప్పుతుందా ? ఇంకా కాంగ్రెసు ఏంజేసింది, వీరిమీద రెండునిందలు మోపింది.

ఒకటేమిటో, వీరు రష్యానుంచివచ్చి, బ్రిటిషు లంచాలుతిని 1942 లో కాంగ్రెసుకు. దేశానికి ద్రోహంచేసినవారు: వీరికి కాంగ్రెసు పునాదులైన అహింస సత్యం, ధర్మయుద్ధంమీద నమ్మకంలేదు. మాకు నమ్మకం ఉందోయిబాబూ ! అని అరచినా అన్నీ పచ్చి అబద్ధాలు, గాంధీని సుభాసునూ తిడతారు. వీరికి దైనందిన జీవితాల్లోనే నీతినియమాల్లేవు. వీరు వ్యభిచారులు. దేశాన్ని బ్రిటిష్‌వారికి ఈవేళ, రేపు జిన్నాకి అమ్మివేయబోతున్న తుచ్ఛులు ! అంచేత వీరి వెనుకటిపంథా ఇప్పటిపంథా దేశవినాశకరం. 2. వీరిరాజకీయ, నైతిక, మానసిక, అర్థికపంథా దేశద్రోహకరంగదా ? పోతే అసలు పలుకుబడి సున్న. ప్రజలకు కార్మికులకు, కర్షకులకూ అరచేతిలో మోక్షంచూపించి. వారిని మోసపుచ్చుతున్నారు. ఈ పని కాంగ్రెసు జైళ్ళలో ఉన్నప్పుడు బ్రిటిష్‌వారి డబ్బుతో లంచాలు తిని చెయ్యగలిగారు. తప్పితే ఇప్పుడు కాంగ్రెసు బయటకువచ్చి. వీరి అసలు రంగు చాకిరేవుపెట్టి బట్టబయలు చేయగానే, వీరిచే మోసగింపబడ్డ కొద్ది మందికూడ కళ్లుతెరచి, వీరి ముఖంమీద ఉమ్మడం మొదలుపెట్టారు- బ్రిటిషువారి అండా, వీరుకూడ మొదట మన కుటుంబంలో వాళ్ళేకదా అని కాంగ్రెసు సహనం ఉండబట్టే. వీరికి ఉండే ఈ మాత్రపు బలిమికి

కారణం. అసలు రంగంలోకి దిగితే వీరిరంగు తేలిపోతుంది అని కమ్యూనిస్టులపై ఆరోపణ చేస్తున్నారు.

ఇందుకు వారేమంటున్నారు ? మేం అన్ని రాజకీయ సంస్థలకంటె వయసులో, (జననం, సుమారు 1930) పిన్నవారం, మా సంఖ్య 30 వేలకు మించదు. మార్క్సిజం చదవడంవల్ల మాకుకొంత రాజకీయ పరిజ్ఞానం కలిగింది. ఆ జ్ఞానంతోనూ, కాంగ్రెసు సాంప్రదాయంతోనూ, సమ్మేళనంచేసి మేం మాపంథాను ప్రజలయెదుట ప్రచారంచేశాం. ఆపరిజ్ఞానంతో 1942 అగస్టు తీర్మానము. చర్చ జరిగినప్పుడు, సభలో ఇది మంచి తీర్మానం గాదు. అంతర్జాతీయంగా మనలను, ప్రపంచపౌరులు ఈ యుద్ధసమయంలో అర్థం చేసుకోక మన్ని జపాను సానుభూతి పరులని నిందవేసి, వారి సానుభూతి మనకు నిరాకరిస్తారు. ఇన్నాళ్ల కాంగ్రెసు చెప్పిన ఫాసిస్టు వ్యతిరేకత, అహింసా సత్యాగ్రహతత్వం, బూటకం అంటారు. బెదరింపులవల్ల లాభంలేదు సరికదా, ఒక దేముడు ప్రత్యేకంగా తమకోసమే ప్రసాదించిన వరం అని, ఈబెదరింపుని ఒకసాకుగా తీసుకొని మనపై గవర్నమెంటు దౌర్జన్యచర్యలు తీసుకొంటుంది. ఈవేళ బెదరించుతాం, పోతే రేపో ఎల్లుండో వైస్రాయితో సంప్రదిస్తాంగా ? అంతవరకేనా మనకు వ్యవధి ఉండకపోతుందా ? అని అనుకోవడం పొరపాటు. గవర్నమెంటు ఒక్కుమ్మడిగా, మనమీదపడి భీభత్సం చేస్తుంది. కాంగ్రెసును అణచివేస్తుంది. ప్రజలను నలిపివేస్తుంది. చివరకు జపాను రావడానికికూడా అవకాశం ఏర్పడవచ్చు. అంతేగాదు, లీగుతో ఐక్యత సాధించి వారిచేతగూడా మన పోరాటంలో పాల్గొనేటట్లు బలం సంపాదిస్తేనేతప్ప పోరాటం అంటు అసలు సాగదు. అంచేత బెదరింపు కూడదు. కాంగ్రెసు లీగు ఐక్యత సంపాదించండి; అంతర్జాతీయు లందరి సానుభూతి సంపాదించండి. లేకపోతే ముప్పు వాటిల్లుతుంచి అన్నారు, అక్షరాలా ఆలాగే జరిగింది. అంతేగాదు. ఆగస్టు తొమ్మిదిని గాంధీజీని పట్టుకోగానే - వెంటనే - ఆ వుత్తరక్షణంలోనే - ఏమన్నారు ? " మనకి గవర్నమెంటుమీద కోపంరావడం సహజమే, కాని మనం ఆగ్రహం వహించి రెచ్చిపోయి అత్యాచారాలు చేశామా పోలీసురాజ్యం వస్తుంది.

మనం శాంతియుతంగా ప్రవర్తించి మన నాయకులను విడుదల చేసుకో వాలిసుమండీ. పోలీసు గూఢచారుల చేతుల్లో పడకండి - రెచ్చిపోకండి - శాంతంవహించండి" అని అన్నారు. అంతేగాదు: ఈ ఆంధ్రపర్యటన లరు - యీ - కరేంగే - యా - మరేంగే ప్రకటనలో - యివి గాంధీజీ యిచ్చిన కార్యక్రమంగాదు - కాంగ్రెసు - అధికారరీత్యా గాని ఇచ్చిన విధానంగాదు. మీరు ఎవరెన్ని చెప్పినా భ్రమపడకండి. గాంధీ అసలు నాయకత్వం వహించనేలేదు. ఇటువంటి విధ్వంసక కార్యక్రమానికి అతను ఎప్పుడూ ఒప్పుకోజాలడు. ఈ కార్యక్రమం ఎవరో కాంగ్రెసు పేరు పెట్టుకొని కొందరు, మోసపోయి కొందరూ, పోలీసు గూఢచారుల కుతంత్రంలో పడి తెలిసో, తెలియకో కొందరు చేస్తున్నారు. యిలాచేస్తే దేశానికి అనర్థంవస్తుంది. కార్యసిద్ధికాదు అని కమ్యూనిస్టులు అన్నారు. వీరు చెప్పినట్లే జరిగిందని యిప్పుడు పూర్తిగా రుజువయింది కదా ! సిమ్లా ముందు వీరేమి చెప్పారు. ఆ తర్వాత ఏమిజరిగిందో ? కాంగ్రెసు మహానాయకులు చెప్పినది ఆశించినది, చంకలు కొట్టుకున్నదీ జరిగిందో - కమ్యూనిస్టులు జోస్యం చెప్పినదే అక్షరాలా - తూ - చా - తప్పిపోకుండా జరిగిందో మీకు తెలుసు.

అయితే - వ్యక్తిజీవితంలో ఎలాగో - జాతీయ జీవితంలోకూడా - అహంకారం. కోపోద్రేకం నాయకుల్లో ఉంటే అవే తాము సూచించే పంథాల్లోకూడా ఉంటాయి. అధికారాపేక్ష - స్వలాభం - శత్రువినాశం కోరడం - తమ వ్యక్తిగత ఆశయాలు. వాటినే మనజాతీయాదర్శాలుగా మనకుచూపిస్తున్నారు. యీరెండూ ఏకంచేసి మనకు చూపిస్తే - మనకు నాయకులు స్వార్థరాహిత్యులుగానే కనుపిస్తారు - ఇదటుండనీ ! ఐక్యత సాధించనిదే స్వరాజ్యం సంపాదించలేము. అందుకు నిదర్శనాలు చూసుకోండి. ముస్లింలీగును మహమ్మదీయుల జాతీయసంస్థగా గుర్తించి మహమ్మదీయులయొక్క పాకిస్థానుసూత్రాలననుసరించి-వివరాల్లో వారితో రాజీ కుదుర్చుకోండి. కిసాను. కార్మికులమధ్య పోటీసంస్థలుపెట్టి వారి ఐక్యతను ధ్వంసంచేయకండి. జమీందారులను, పెట్టుబడిదారులను, దొంగవ్యాపారస్థులను. దుండగీడులను మీలోకితెచ్చి పెద్దవారినిచేస్తే జాతీయైక్యతపోతుంది.

పాటకజనంయొక్క న్యాయమైన కోర్కెలను విస్పష్టంగా అంగీకరించండి. హరిజనులను ఇంతవరకు మీరు జాతీయ మహమ్మదీయులను ఏట్లాచూచారో అట్లాచూచారు. వారిలో కొద్దిమందిని పెద్దలుగా తయారుచేసి వారికి కొన్ని పదవులు ఇచ్చి వారి తోడివారి మీద ఏకు మేకులను చెయ్యకండి. హరిజనులకు కావలసింది - దేవాలయప్రవేశంకాదు - డిస్ట్రిక్టు బోర్డు, మ్యునిసిపాలిటీలలో మెంబరు పదవులు కాదు - పార్లమెంటరీ పదవులు కావు - ఏవో నాలుగు పాఠశాలలు కావు - వారికి కావలసింది - హరిజన ప్రజానీకం అందరికీ భూములుకావాలి - సగౌరవమైన ఆర్థిక ఉపాధి కావాలి - అవిఅవి కాంగ్రెసు కల్పించక యేవోనాలుగు పదవులు పారెయబట్టే - అంబేద్కరుకు పలుకుబడి హెచ్చు అవుతోంది. వారిని దేశద్రోహులంటే లాభములేదు.

ఐక్యత మా విధానము - ఈ విధానము మీరు దేశద్రోహమంటూ మమ్మల్ని కాంగ్రెసునుంచి దేవిడీమన్నాచేసారు. మేము యే ప్రజలమధ్య యీ కొద్దికాలము పనిచేశామో వారిని అడిగి తెలుసుకుందాం. వారితీర్పు అంగీకరించుదాం. ప్రజాస్వామ్య సూత్రాలప్రకారం అది యెలా సాధ్యమవుతుందంటే - యెన్నికలలోనిల్చి మా పంథాను విశదీకరించి ప్రజలయొక్క అభిమతాన్ని కోరడమే. మాకు వేరేమార్గములేదు. మీలో ఉండనిస్తే మిమల్ని వొప్పించి వుందుము. ఆ అవకాశము మాకు లేకుండా చేశారు. అంచేత మేం కాంగ్రెసుకు పోటీగా నిలబడవల్సి వచ్చింది. కాంగ్రెసు ప్రజాస్వామిక సంస్థ. అంచేత యేమి చెయ్యాలి? ఇలాంటి కోపతాపాలు పెట్టుకోకుండా - అందరూ అభిప్రాయభేద విచక్షణలేకుండా నాల్గణాల సభ్యులుగా నేడు చేర్పించి వారిచే కాంగ్రెసు కమిటీలకు యెన్నికలు జరిగించి ఎ. ఐ. సి. సి. ని నూతనంగా యెన్నుకొవి. అట్టి ఎ. ఐ. సి. సి. నుండి వర్కింగు కమిటీని అధ్యక్షుడు నియమించి అప్పుడు కాంగ్రెసు యెన్నిక ప్రణాళికను తయారుచేయించి అది పి. సి. సి. యెదుట పెట్టి ఒప్పించి పార్లమెంటరీ బోర్డులను యెన్నుకొని అట్టి బోర్డువారిచేత అభ్యర్థులను నిలబెట్టించితే మాకుకూడ కాంగ్రెసు ప్రణాళికను తయారు చెయ్యడంలో అవకాశము వుండివుండునుకదా.

మేం అందరం కలిపితే 30 వేల మందిమి, మేం కాంగ్రెసులో నుంచి విడిపోవలసి వచ్చినా - మేము కాంగ్రెసును విధ్వంసం చెయ్యము - చేయజాలము కూడాను. మాకు కాంగ్రెసుమీదవుండే గాఢాభిమానముకు తార్కాణ మేమిటంటే - మేము యెక్కడయితే పనిచేసి ప్రజలతో సంబంధము పెట్టుకొన్నామో. ఆ స్వల్పసంఖ్యగల నియోజకవర్గాలలోనే మేం ప్రజలముందు నిలబడి - మేం కాంగ్రెసు ద్రోహులమా, కాంగ్రెసు విచ్ఛిన్న కారకులమా, తుచ్ఛులమా, పోకిరీలమా, హింసావాదులమా - లేక మేం కూడ దేశభక్తికలవారమేనా - అని అడుగుతాం. మేం నిజంగా కాంగ్రెసు విచ్ఛిన్న కారకులమయితే - మాకు పలుకుబడి వున్నచోట్ల లేవిచోట్ల, నానా రకాల వాళ్ళతోటి చేతులుకలిపి - నిలబడి జాతీయ జీవితంలో గందరగోళము తెచ్చిపెట్టి యుందుము. ఆంధ్రలో మేము నిలబడేది యే యిరవై ఐదు చోట్లనో, తమిళనాడులో పది స్థలాలకు లోపే. తదితరచోట్ల - కాంగ్రెసువారినే బలపరుస్తాము. దొంగ కాంగ్రెసు వాదులను మీరు నిలబెడితే మాత్రము మేము పోటీచేస్తాము. అలాగే లీ గు వా రు సరియైన దేశభక్తులను నిలబెట్టినచోట్ల వారికి సహాయము చేస్తాము. వారైనా దొంగమార్కెటు దారులను, ప్రజలను పీడించే జమీందార్లను నిలబెడితే వారికెదురు ప్రచారంచేస్తాం. ఆవిధంగా పాకీస్థాన్‌సూత్రం న్యాయమైనకోర్కెఅని. కాని పంజాబులో కొన్ని జిల్లాలను కోరడం, బెంగాలులో తూర్పును కోరడం, అస్సాంఅంతా మా కిచ్చివేయండి అనడం, తప్పు అని ఖండించి ముస్లిం సోదరులతోచెప్తాం. ఈవిధంగానే హరిజన ప్రత్యేకవర్గాలలో షెడరేషనువారికి సహాయంచేస్తాం. ఇవన్నీ కూడా కాంగ్రెసులోవుండే చేసివుందుము. ఇంతకీ ప్రజలమీద వదిలేద్దాం. మేము 30 వేల సభ్యులం. మా సానుభూతిపరులు కిసాన్‌వర్గంలో 10 లక్షలమంది, కార్మికవర్గంలో 10 లక్షలమంది. వీరందరూ రేపు ఎన్నికలలో మామీద ఏ తీర్పు చెబుతారో, వారినే అడగండి. మేం నిలబెట్టేవారందరూ గెల్చినా - మేం ఏం పదవులకూ ప్రాకులాడ్డంలేదు. పిల్లిమీద ఎలుక నెక్కించడం, ఎలుకమీద పిల్లి నెక్కించే చాణక్యం మా కక్కరలేదు. మా మీద మీరు మోపిన నిందలను తొలగించుకో

డానికి మేం మాకు తెలిసిన నియోజక వర్గాల యెదుట నిలబడుతున్నాం. అది కాంగ్రెసు ద్రోహం కాజాలదు. మేం ఏ కొద్దిమందిమో చట్ట సభ ల్లోకివస్తే - కాంగ్రెసు సభ్యులతో ఏకీభవించవలసినవారం. అథవా మమ్మల్ని ఎవరినైనా, రాజ్యాంగ ప్రజాపరిషత్తుకు ఎన్నుకుంటే అక్కడ మా నమ్మిక ప్రకారం - పాకిస్థాన్ విషయంలో లీగుతోను విభజన విష యంలో సరిహద్దులను నిర్ణయించడం విషయాల్లో నిష్పక్షపాతంగా వ్యవహరిస్తాం. ఇది కాంగ్రెసుకు ద్రోహంకాదు, ఈవేళ మా మీద కాంగ్రెసు నాయకత్వం అధికారయుతంగా ఆగ్రహం వహించింది. ఈ హడావుడులు అయాక పరిస్థితులు మారుతాయి. ఈ ఎన్నికలలో మా ప్రవర్తన పరీక్షించండి. మేం అభ్యర్థులను ఎటువంటి వారిని నిల బెడుతున్నామో చూడండి. అబద్ధాలు చెపుతున్నామో, రౌడీ చర్యలు చేస్తు న్నామో, సుశిక్షణ, కాంగ్రెసు సాంప్రదాయాల ననుసరించి ఎన్నికల ప్రచారం సాగిస్తున్నామో లేదో చూడండి. లీగుమీద కోపంతో లీగును నాశనం చేస్తామని, మామీద కోపంతో మమ్మల్ని నాశనం చేస్తామని అహింసపేరుతో అభిప్రాయభేదంగల వారినందరిని దేశద్రోహులని నిందించి వారిపై లాఠీ ప్రయోగాన్ని సమర్థిస్తూ బెంగాలులో సుభాసు పలుకుబడి హెచ్చుగా ఉందని చెప్పి, అది తమ పక్షం తిప్పుకోడానికని శరత్‌బాబును కాంగ్రెసులోకి ఆహ్వానించి, అజాదు హిందుసేన వారిమీద గల ఆపేక్షను ఎన్నికలకు వినియోగించుకోడానికి వాళ్ళ మిలిటరీబలాన్ని పొగుడుతూ, వాళ్ళను వీరులుగా ఆరాధిస్తూ, కమ్యూనిస్టులమీద కోపం చేత ఇదివరకు ప్రశంసించిన రష్యాను తిడుతూ, బ్రిటిష్‌వారిమీద కోపం ఉన్నా - ఏం చేయడానికి శక్తిలేక వాళ్ళనే మధ్యవర్తులుగా పొగుడుతూ, వాళ్ళు సూచించిన పంథాకే అడుగులకు మడుగులొత్తుతూ అనుసరిస్తు న్నది. కాంగ్రెసు అధికారయుతంగా సూచించిన పంథా హిందూ ముస్లిం ఐక్యతకు వ్యతిరేకం. నిమ్నజాతుల ఉద్ధరణకు వ్యతిరేకం. అహింసకు వ్యతిరేకం. ప్రజాస్వామ్య సూత్రానికి వ్యతిరేకం - స్వరాజ్యసాధనకు వ్యతిరేకం. మా పంథా కాంగ్రెసు ముఖ్యసూత్రాలను శిరసావహిస్తున్నది.

అంచేత  మేం అధికార కాంగ్రెసు నాయకత్వానికి వ్యతిరేకులమైనా - అసలు కాంగ్రెసు మూలసూత్రాలను మేమే పాటిస్తున్నాం.

భరతా ! నువ్వడిగిన ప్రశ్న లన్నిటికి జవాబు ఇచ్చాము. మీకు అవి తృప్తికరంగా ఉంటాయని, ఆశిస్తాం. మన కుటుంబం యాభై ఏండ్ల నుంచి క్రాంగ్రెసు సాంప్రదాయ కుటుంబం. మనం 60, 70 మందిమి 1920 నుంచి నిత్యఖద్దరుధారులం, 20 మందికిపైగా కాంగ్రెసు వివిధ ఉద్యమాల్లో పాల్గొన్నాం. ఎనమండుగురు జైలుకు దఫ దఫాలు వెళ్ళేరు అటువంటి కుటుంబానికిచెందిన మే మిద్దరమూ ఈవేళ కాంగ్రెసుతో నాలు గజాల సంబంధంకూడా వదలుకుంటున్నామన్న సంగతి మీకందరికీ ఎంతో మనస్థాపం కలిగించక మానదు. మే మిద్దరంకూడా గత నెల రోజులనుంచి తీవ్రంగా ఆలోచించి ఎంతో బాధపడుతూ యీపని చేస్తున్నామని నమ్మండి. ఈ ఉత్తరంలో మీ కందరకు తెలియని కొత్తసంగతు లేవీలేవు. అయినా మేము వ్రాసినసంగతులు జాగ్రత్తగానూ; సహనంతోనూ చూడమని మన కుటుంబంవారి నందరినీ మరీ మరీ కోరుతున్నాం. మనంఎప్పుడుకూడా కాంగ్రెస్‌లో పదవులకు ప్రాకులాడలేదు. ఈవేళ కాంగ్రెసుకోంచి పోతే కాంగ్రెసుపంథాయే సరియైందని రేపు తేలితే రేపే తిరిగికాంగ్రెసులోకి వస్తాం. మామీద మీరు తొందరపడి దేశద్రోహులమని నింద మోపవద్దని కోరుతున్నాం. ఈనాడు కాంగ్రెసునాయకత్వం గాంధీజీనే మూలకుతోసేసింది. గాంధీజీసూత్రాలు వారికి నచ్చలేదు. ప్రస్తుత రాజకీయావస్థలో  సత్యం అహింస సత్యాగ్రహానికి తావులేదంటున్నారు. కాంగ్రెసు లోంచి వేరుపడిన పక్షమే గాంధీజీ నాయకత్వాన్ని పూర్తిగానూ, మన స్ఫూర్తిగా శిరసావహిస్తున్నదని మేంఇద్దరం ధైర్యంగా చెప్పగలం. ఈ ఉత్తరం మీరందరూ అమ్మ, విద్యమ్మ, అక్కయ్య. బ్రమరాంబక్కయ్య [illegible]క్కయ్య గార్లూ అందరూ చదవమని. [illegible] విమర్శించమని కోరుతూ విరమిస్తున్నాం.

ఇట్లు ప్రేమతో
లక్ష్మణ

వెల: పావలా ప్రచురణ నెం.

## సామ్రాజ్యవాదుల కుట్ర

### (కూప్లండు ప్లాను)

★

బ్రిటిషు మంత్రులువచ్చి మన దేశ నాయకులతో రాయబారాలు సాగిస్తున్నారు. ఈ రాయబారాలనుగురించి మీరు ప్రతిదినం పత్రికల్లో చూస్తూనే వున్నారు.

ఈ మంత్రులు భారత దేశంపై కూప్లండుస్కీము రుద్దాలని చూస్తున్నారని కమ్యూనిస్టుపార్టీ పదే పదే హెచ్చరిస్తూంది.

ఐతే ఎవడీ కూప్లండ్? అతడు మన దేశానికి తయారుచేసిన స్కీము ఏమిటి? దానిని సామ్రాజ్యవాదులు భారత దేశంపై యెలా రుద్దాలని చూస్తున్నారు?

ఇవన్నీ తెలుసుకోవాలంటే ప్రతి ఒక్కరూ చదివితీరాలి.

రచయిత: డా॥ జి. అధికారి

(పటాలతో సహా వివరించబడింది)

వెల: రెండణాలు

## అంతిమ పోరాటా

## కదలి రండు!

★

'కాబినెట్ మిషన్ వచ్చింది. ఎ ళ్ళనుంచో కాచుకుకూచున్న స్వా త్ర్యం చాలా దగ్గర కొచ్చింది, వీధి మలుపులోనేవుంది' అనే బ్రి నాయకులు కలిగిస్తున్నారు. "స దింపులతో స్వరాజ్యంరాదు; అం కలసి ఆఖరిదెబ్బ తీస్తేనే వస్తు అని కమ్యూనిస్టుపార్టీ చెబుతో

అందరూ ఎలా కలుస్తారు? యేవిధంగా పోరాడుతారు? క్కటే స్వాతంత్ర్యానికి ఎలామా ఈ విషయాలు తెలుసుకోవాల ప్రతి ఒక్కరూ యీ పుస్తక చదవాలి.

రచయిత: పి. సి. జోషి

వెల: పది అణాలు

ప్రజాశక్తి కార్యాలయం - బెజవాడ

ప్రజాశక్తి ప్రెస్. మొగల్‌రాజపురం, బెజవాడ—కె. 13/పి.—కాపీలు 5000.